# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 | రాజమహేంద్రవరము 16-9-1980 | సంచిక 22


—* ఈ సంచికలో *—



1—10—1980 సంచికలో ప్రబంధ శృంగారములో శిల్పచమత్కృతులు, కృష్ణమంజరి తరిగొండ వెంగమాంబ, జాషువ అనాథకావ్యం మానవతావాదం, శివశంకరులు_కవిప్రియ, తెలుగువారు_ఉర్దూ భాషాసేవ మొ॥ ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—


చందా:

సంవత్సరమునకు రు. 10—00

అర్ధసంవత్సరమునకు రు. 5—50.

విడిప్రతి 50

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 3 | రాజమహేంద్రవరము 16-9-1980 | సంచిక 22


# విశ్వనాథ మేనకా విశ్వామిత్రము


— డా. శ్రీ చన్నాప్రగడ తిరుపతిరావు, ఎం. ఏ., పిహెచ్. డి.


'కవి ప్రతిభలోన నుండును కావ్యగతశ
తాంశములయందు తొంబదియైనపాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాధృతిని మించి.'

విశ్వనాథవారి ఈ సిద్ధాంతమునకు రమ్యమైన ఉదాహరణము వారి మేనకా విశ్వామిత్రము. ఈ ఘట్టము బాలకాండ మునందలిది. జనకుని పురోహితుడైన శతానందుడు శ్రీరామునకు విశ్వామిత్రుడు బ్రహ్మర్షియైన విధమును తెలుపు సందర్భమునందలిది. వాల్మీకమునందిది పది అనుష్టుప్పులలో ముక్తసరిగా, కథాప్రధానముగా చెప్పబడినది (సర్గ 63; శ్లో 3-13) కావ్య ప్రపంచ సృష్టిలో అపర విశ్వామిత్రుడైన విశ్వనాథ దీనిని అత్యంత రసవంతముగ 31 గద్యపద్యములలో (వానిలో 5 సీసములు, 15 వృత్తములు) పునస్సృష్టి గావించినాడు. (ధనుఖండము 181-211) ఇచట విస్తరణ ఒకటికి ఆరింతలుగా జరిగిన దని చెప్పవచ్చును మరికొంత సూక్ష్మముగా పరిశీలించినచో ఈ విస్తరణ జరిగిన సందర్భములను ఈ క్రిందివిధముగా గుర్తింపవచ్చును.

'తతః కాలేన మహతా,
మేనకా పరమాప్సరాః
పుష్కరేషు నరశ్రేష్ఠ,
స్నాతుం సముపచక్రమే'

ఈయొక్క శ్లోకమందలి మేనక ఆగమనము ఒక సీసపద్యములో విస్తృతము కాగా, ఆమె స్నాన సౌందర్యము ఒక వృత్తము, ఒక సీసముగా విస్తరిల్లినది.

తాం దదర్శ మహాతేజా,
మేనకాం కుశికాత్మజః
రూపేణా ప్రతిమాం తత్ర,
విద్యుతం జలదే యథా.

ఈ శ్లోకమొక వృత్తమైనది. ఇందలి ఉపమను విశ్వనాథ స్పృశింపలేదు. ఇతరుల ఎంగిలిని తాను ముట్టడని విశ్వనాథ ప్రతిజ్ఞ. ఇతివృత్త బాహ్యరేఖలు తప్ప వర్ణనాలంకారాదుల విషయములో వాల్మీకి ఎంగిలియు ఆయన పరిహరించినాడు.

కందర్పదర్ప వశగః

ఈశ్లోక పాదమందలి కందర్పదర్పము ఐదు పద్యములుగా విజృంభించినది.

......ముని స్తామిద మబ్రవీత్
అప్సరః స్వాగతం తే స్తు,
వసచేహ మమాశ్రమే
అనుగృహ్ణీష్వ భద్రం తే,
మదనేన విమోహితమ్
ఇత్యుక్తా సా వరారోహా,
తత్రవాస మథాకరోత్.

ఈ ఒకటిన్నరకాలు శ్లోకము ఒక వృత్తముగా పరివర్తితమైనది. ఇచ్చట విస్తరణ జరుగలే దనియే చెప్పవచ్చును.

తపసో హి మహా విఘ్నో
విశ్వామిత్రము పాగమత్

ఈ అర్ధ శ్లోకమున జరిగిన తపో విఘ్నము 7 పద్యములలో అందు 3 సీసములు రెండు వృత్తములు- అత్యంత రసవంతముగా సాగినది.

తస్యాం వసన్త్యాం వర్షాణి
పంచపంచ చ రాఘవ
విశ్వామిత్రాశ్రమే సౌమ్యే
సుఖేన వ్యతిచక్రముః

ఈ శ్లోకమందలి పదియేండ్ల కాలగమనము ఒక వృత్తముగా పరివర్తితమైనది.

అథకాలే గతే తస్మిన్
విశ్వామిత్రో మహామునిః
సవ్రీడ ఇవ సంవృత్త
శ్చింతా శోక పరాయణః
బుద్ధి ర్మునేః సముత్పన్నా
సామర్షా రఘునందన
సర్వం సురాణాం కర్మైతత్
తపోపహారణం మహత్
అహోరాత్రాపదేశేన
గతాః సంవత్సరాదశ

కామమోహిత భూతస్య
విఘ్నోయం సముపస్థితః
సనిశ్వ్వసన్ మునివరః
పశ్చాత్తాపేన దుఃఖితః

విశ్వామిత్రుని పశ్చాత్తాపము మూలములో మూడున్నర శ్లోకములు కాగా అనువాదములో నాలుగు గద్యపద్యములు మాత్రమే. ఇచటను చెప్పదగినంత విస్తరణ జరుగలేదు.

భీతా మప్సరసం దృష్ట్వా
వేపన్తీం ప్రాంజలిం స్థితామ్

ఈ శ్లోకార్థమందలి భీతాప్సరః సౌందర్యము ఒకవృత్తముగా పెనుపొందినది.

మేనకాం మధురై ర్వాక్యై
ర్విసృజ్య కుశికాత్మజః

ఈ శ్లోకార్థములో సూచనామాత్రముగా తెలుపబడిన మధుర వాక్యములు ఆరు పద్యములలో అత్యంత మధురోదాత్తముగా కూర్చబడినవి.

మొత్తముమీద ఈ విస్తరణ జరిగిన విధము చూడగా మూలమునందలి వైరాగ్యజనకమైన సందర్భము కవిసమ్రాట్టుల చేతిలో రాగజనక మగుట వుద్దేశింపబడినట్లు రూపాంతరిత మైనట్లు గమనింపగలము.

వాల్మీకిది ప్రధానముగా తాత్త్వికదృష్టి. విశ్వనాథది రసదృష్టి. 'రసో వై సః' అనుటచే తత్త్వము రసముకంటె భిన్నము కాదు

* * * *

ఇపుడు విశ్వనాథ పునఃసృష్టి గావించిన మేనకా విశ్వామిత్రుల సౌందర్య స్వభావములను సమీక్షింతము.

విశ్వామిత్రుని ఆశ్రమమునకు మేనక (?)ంటె మున్మున్నగా వసంత మరుదెంచినది (?) వచ్చిన వసంతము కోకిలాలాప కాతూహలములతో, పల్లవహస్త సంజ్ఞతో, నదీవేణికాదుకూల కాంతితో, సరోరుహకేసర (?)హాసతతో, కోమలాతప ప్రేమరేఖతో (?)రాళి కూజనోత్సాహముతో అప్సరసపోలె వచ్చిన దట. ఈ ఋతువర్ణన మేనకా పాత్ర ప్రవేశమును సూచించుచు నాట్య శాస్త్రోక్తమైన ప్రవర్తక మను ఆముఖాంగమైయున్నది.

సరస్సులో స్నానమాడిన మేనక మోహన మోహనాంగరేఖా గోపనయత్న మొనర్చినను, ఆమె మేని జిగి యొంపు సొంపులు సిక్తచేల మర్ధపారదర్శక మగుటచే స్పష్టాస్పష్టముగ గోచరించుచునే యున్నవి విశ్వామిత్రునకే కాదు, పాఠకునకు కూడ.

ఎడమచూపు గ్రహించి తడిచేలఁగుచమండ
లము గోపనము సేయు లలితరేఖ
ఎడమచే బిఱుఁదుపై నడుముపైఁ దడిచీర
లాగునో యన్న విలాసదీప్తి
కను లోరగా వంచి క్వచిదక్వచిద్దృష్టి
పాతంబు సేయు విభ్రమము సొంపు
మువ్వంకలుగ నిల్చి బొట్టనవ్రేలూను
నెడమపాదము నాట్యహేల బెడఁగుఁ
బొరలిపోవునట్లు పుష్కరతీర్థంబు
నందు స్నానమాడి యంబు లోడు
కేళిహాళిదీప్తి కేడించు మేనక

ఇచట రేఖలను వర్ణరంజితము గావించినది కవిలేఖనియో, చిత్రకారుని కుంచికయో యను భ్రాంతి కలుగుచున్నది.

మేనకా విశ్వామిత్రు లొకరినొకరు రెప్పవాల్పక చూచుకొనిరి అది పరస్పర ప్రవేశానుకూలముగా వారు తమహృదయ సదన కవాటములను తెరచియుంచినట్లున్న దట. విశ్వామిత్రుడు మేనకను చూచిన తీరు 'తలగోళ్ళ' దువ్వుచున్ గప్పిన యోడుమీసలును గడ్డముఁ దర్జనిఁ బాయఁ దోయుచున్ విప్పుగు ఊర్ధ్వముగా నిలిచి'- పాఠకునకు నిశ్చల చిత్రమును గాక చలచిత్రమును గాంచుచున్న భ్రాంతిని కలిగించుచున్నగి.

చూపులు మాటలకు, మాటలు తాకిడికి, తాకిడి తగులములకు దారితీసిన క్రమము అత్యంత సహజముగానున్నది. అతఁడామెను దయతో 'అయ్యో, పాపము తడిలో నానిపోవుచున్నావు నీ తలకొట్టుకలు తుడుతునా?' యని సొయపడబోయినాడు. ఆమె లజ్జతో వల దని వారించినది అతడు తనవూనిక మానలేదు. 'ఫలము తడి కౌఁగిలింతగాఁ బరిణమించె'

తుడిచిన దెవ్వరో తుడవఁ
దోఁపదుగాని లతాంగి మాత్రమున్
జొడియగు చీరఁదాల్చి విడు
పుంగని మానియొడిన్ శయించె.

ఆమె హస్తము లాతని భుజములకై వ్రాలినవి. వారిచూపులు వలపులు ప్రుక్కిలించినవి వారొకరినొకరు 'చెలీ, నీవు నా ప్రాణము' అనగా 'చెలీ, నీవు నాప్రాణము' అనుకొందురు ఇట్లు క్రిందొచు మీదొచు వారల కేలివిభవంబు పట్టకుండ పోయిన దట.

మోహము నిరంకుశము కాగా కుశికాత్మజుడు కృష్ణాజినము, కమండలువు, అగ్నులు, దర్భలు, మూలద్రోచినాడు. మేనకావిశ్వామిత్రుల ప్రణయకేళి మూడు సీసములలో మనోమోహకముగా వర్ణితమైంది అతడామెకు వెదురుగొట్టాలతో ఇప్పపువు కల్లు తెచ్చి నోటికందిచ్చును, ఎర్రని పూలరసముతో ఆమె పాదములకు పారాణిదిద్దును, ఘనసారచందన కర్పూర తరుఖండములతో ధూపము వేయును; సురభిళములైన పుష్పములను కొప్పులో ముడుచును. ఇట్లు సేవలు చేసి ఎదుటనిలిచి కీలియెల్లయు నొడలియుంచులను హేర నవ్వి చూచుచుండుట ఆడుదానిని సేవించుట లోనే మగవాడు తనమగసిరికి సార్థక్యము నెంచును.

కోకిల కొమ్మలోఁ గూసిన నీవలే
నన్నుఁ బిల్చితి వంచు నవ్వు మాని
తుమ్మెద పొదలోన ఝుమ్మన నది యేమి
మణితమే యని మేలమాడు మాని
వన శిఖావళము విప్పిన పింఛమును జడి
తుడుతువే యని కొప్పువిడుచు మాని
యిత్తను గిట నిల్వ నేమిచూపు లెయంచు
నతివ చెక్కిలి ముద్దులాడు మాని

యౌవన గదల భయమటంచును దనకును
నుచిత కౌఁగిలింత నొదుగు మాని
మానిమానికాఁడు మమతచే వాచాల
సార్వభౌముఁ డయ్యె సౌర్యరత్న!
తనపాద మామె పాదము జతగాఁ బెట్టి
యస్మత్పదంబు మో టనివచించుఁ
దనహస్త మామెహస్తముమీఁదబోర్లించి
నీచేయిలే దని నిహ్నవించు
నా మిత్రపక్కగనిల్చియగునాబుజముదాఁక
వచ్చితివే యని పలవరించుఁ
జెక్కిలిఁ జెక్కిలిఁ జేల్చి గడ్డముగ్రుచ్చు
కొన్నదా యని గ్రుచ్చిగ్రుచ్చి యడుగు
నానుకొని కూరుచుండి నీ యచ్చమైన
రత్నకాంతి తనూప్రభారాశిక్రమ్మ
నా తనూకాంతిగూడ రత్నముల ప్రభలు
చిమ్మ నని చిక్కరించును జికిలినవ్వు.

వర్ణన రసవంతముగనే యున్నదిగాని, నీరసువాదుల కొక ధర్మసందేహము ఈ శృంగార వర్ణన చేయుచున్నది మునియైన శతానందుడు చెప్పుచున్నది బాలుడైన రామునితో ఇది అవాచిక్య దోషజుష్టము కాదా యని శంక. ఇదిచాలదో యన్నట్లు శతానందుడు రాముని 'శ్రీసతిఫుల్లగల్ల పరిచిహ్నిత కుంకుమ పత్రభంగ విన్యాసిత రమ్యవక్షు' — లక్ష్మీదేవి యొక్క పులకరించిన చెక్కిళ్ళపై చిత్రింపబడిన కుంకుమపత్ర రచనలు అంటుకొనిన అందమైన వక్షస్సుగలవాడా — అని సంబోధించును చూడగా బాలరాముని ముగ్ధ హృదంతరంగములో మరల గిలిగింతలు పెట్టి వలపులతరగల నాప్లావంగ జేయుటే శతానందుని యుద్దేశమైనట్లు కనిపించుచున్నది మునివృత్తి కది తగునా?

కేవల బ్రహ్మనిష్ఠుడైన వసిష్ఠ మహర్షి శిష్యవృత్తింలో పెరిగిన బాలరాముని లేత యెడదలో ఇంతవరకు స్త్రీపురుష సంబంధమైన తలపుల వికారరేఖ కలిగినట్లు లేదు ఇప్పు డాతడు వివాహితుడు కాబోవుచున్నాడు. వైవాహిక జీవితానుభవమునకై తగిన మధురభావనల నాతని మనసులో ఉప్పతిల్ల జేయు టవసరము. జీవసహజమైన కామము రామునిలో బీజప్రాయముగ నిద్రాణమైయున్నది దానిని శతానంద కృషీవలుడు ఈ మేనకా విశ్వామిత్ర ప్రణయ కథావారి సేచనముతో ఆర్ద్రి మొనర్చి అంకురిత దశకు తెచ్చుచున్నాడు పురుషార్థములలో నొకటైన కామము నెడ రాముని అభిముఖుని గావించుచున్నాడు. ఇది కర్తవ్యమే గాని దోషముకాదు,

శతానందుని ఈకథాకథనరీతికి కౌర యౌవన సంధిదశ యందున్న రామలక్ష్మణుల మనోక్షేత్రము ముందొక నూతన లోకము నావిష్కరించినది. కథాశ్రవణానంతరము రాముడు లక్ష్మణునితో ఏకాంతమున నిట్లనెను.

'నీవికొక్క సంగతిఁ జూచినావె వత్స!
యన్ని యంశములను జెప్పినట్టి తీరు
వేఱు, మేనక కథ తీరువేఱుగాద?'
(ధనుష్ 274)

అనిన లక్ష్మణుఁ డౌ ననెను.

రాముని హృదయముపై ఈ మేనకా విశ్వామిత్రుల ప్రణయకథ గాఢముద్రను వైచినది. గాధిజుడు రామునకు అస్త్ర విద్యా గురువే కాక ప్రణయ విద్యా గురువును అయినాడు. అతని చరిత్రనుండి నేర్చిన పాఠములనే తరువాత రాముడు సీతయొద్ద అప్పగించినాడు.

కోకిల దూరానఁ గూసిన నీవ కే
నన్నుఁ బిల్చితి వంచునవ్వు సామి
తుమ్మెద గూటిలో ఝుమ్మన నిఁకయే ర
హస్యము..దునో యంచు నాడుసామి
గృహ శిఖావళముత్తీర్చినఁ బించమును నీదు
కైశికచ్ఛవి నెంచంగ దను సామి
పెంపుడు లేడి ద్వారంపు కోసలఁ జూడ
నవని జాతులఁ బోల్చి యాడుసామి
సీత చెఱగు గాలిచేఁ జిందులాడిన
దాని నిగుడు వాలంలోన నిలిచి
పడవలోన నేను పయనించుచుంటి నం
చేలొ భయము నభినయించు సామి
(కల్యాణ-286)

తన పాద మామె పాదము జతగాఁ బెట్టి
యస్మత్పదంబు మో టని వచించు
తనహస్త మామెహస్తముతోఁ జతఁ జేసి
మదురాకు చివురాకు పదము లనును
ఆమె ప్రక్కన నిల్చియానుకొమ్మని నన్ను
విడిపోకు వేయని విఁసిపోవు
చెక్కిలిఁ జెక్కిలిఁ జేర్చి యాప్రాతన్ను
లేవో రహస్యంబు తెత్తిపోయు
(కల్యాణ-287)

సీసముల తొలిపాదము లందలి భావములు ఎక్కువ మార్పులేకయే రామునిచే పునరుక్తములైనవి శిష్యుడుగురూపదేశము ననుష్ఠానమునకు దెచ్చుకొనుటలో ఇది తొలిదశ. తరువాతి పాదములలో గురుని భావములకు శిష్యుడుగావించిన సంస్కారము కనవచ్చుచున్నది. ఇది శిష్యుని పెరుగుదలలోని మలిదశ. 'మణికము' వంటిది ప్రౌఢాంగనతో విశ్వామిత్రునివంటి ప్రౌఢుడు పలుకదగినది బాలయైన సీతతో బాలుడైన రాముడు పలుకునది కాదు గురుజనుల సముఖమున మెలగుచున్న రామునకు సీత తడికురులనుతుడుచుటకుగాని, ముంగిట ముద్దిడుటకుగాని అవకాశములేదు సీతారాములు దాదాపొక్క ఈడువారు. రాముడింకను ఒడ్డుపొడ్డుగు తేరలేదు. అందుచే సీతచేతిని తనచేతితో నిహ్నవించలేదు 'నీవు నా బుజముల వరకు వచ్చితి'వన లేదు రాముని కపోల చిబుకము లింకను రోమశములు గాలేదు. అందుచేతనే 'గడ్డము గ్రుచ్చుకొన్నదా' యన్న ప్రశ్న లేదు.

బాలుడైన రాముని ప్రౌఢతనపుమాటలకు చేతలకు ముగుదయైన సీత తబ్బిబ్బుపడినది, అబ్బురపడినది

శ్రీ మనోనాథు లీలావిశేష మరసి
సీత యోస్వామి యెందు నేర్చితనియడుగ
నేను నేర్చిన దేమున్నదే నతాంగి
కౌశికుం డుపదేష్టయుఁ గాని దనును.
(కల్యాణ-288

ఇచట మరొక ప్రశ్న, ఆదర్శదంపతులైన సీతారాముల పవిత్ర ప్రణయమునకు ఒక తపోభ్రష్టుని వేశ్యా ప్రణయమును ఆదర్శముగా నిరూపింపదగునా? అని.

వేశ్యాసహవాసము నింద్యమనునది నేటి నీతిపరులనీతి. ప్రాచీనుల దృష్టిలో అది అవినీతి కాదు. ఐనచో మునిప్రోక్తమైన వాత్స్యాయనీయమున వైశికాధికరణముండెడిది కాదు. వేశ్యలు గౌరవహీనురాండ్రు కారు. ఐనచో రాజసభలలో, పెండ్లి పేరంటములలో, దేవుని ఉత్సవములలో వారికంత ప్రాధాన్యముండెడిది కాదు. సంఘముయొక్క సువ్యవస్థకు తక్కిన వృత్తులెట్లో వేశ్యావృత్తియు అట్లే- అంతకంటె నెక్కువయే- అవసరమని ప్రాచీనులు భావించిరి. మితిమీరిన వేశ్యావ్యామోహము అనర్థములకు దారితీయు ననునది వేరుమాట. అతిసర్వత్ర వర్జయేత్. మనుజుని మనుగడకు అవసరమైన నీరు, నిప్పు, గాలి — చివరకు ప్రాణాధారమైన అన్నముకూడ మితిమీరినచో ప్రమాదకరములే యగును. మితిమీరిన స్త్రీయోపారతివలన విచిత్రవీర్యుడు రాజయక్ష్మ పీడితుడై అకాల మృత్యుగ్రస్తుడైనాడు. రాముని ఏకపత్నీవ్రతము స్తుత్యమేయైనను, దశరథుని బహుపత్నీకతయెట్లు నింద్యముకాదో, శుకుని శాశ్వత బ్రహ్మచర్యము ప్రశంసనీయమే యైనను జనకుని గార్హస్థ్యమెట్లు దూష్యము కాదో, అట్లే ఋషివరుని వేశ్యాసాముఖ్యము అనవద్యమేయైనను విశ్వామిత్రుని వేశ్యానురాగముకూడ దుష్టముకాదు. ఋశ్యశృంగుని చరిత్రకూడ కొంతవరకీ యభిప్రాయమునే సమర్థించుచున్నది. ఈ యభిప్రాయముతోనే విశ్వనాథ 'వేయిపడగలు' లో మహాపురుషుడైన రామేశ్వరశాస్త్రికి వేశ్యాప్రియత్వమును కల్పించినాడు అది ప్రాచీనుల ఉదార వాస్తవిక దృక్పథము.

విశ్వామిత్రుడు మేనకా సాంగత్యమువలన పతితుడు కాలేదు. అది ఆతనికి లక్ష్యసిద్ధిలో కొంతకాల నష్టమునకు మాత్రమే కారణమైనది. తాత్కాలికమైన ఈవిఘ్నమువలననైన తపోభంగము ఆతని నెంతగా క్రిందికి గుంజినదో, అంతిమ కామవిజయమున కంతగా తోడ్పడి, ఆతనికి ఇతోధికౌన్నత్యమును చేకూర్చినది. మేనకా విశ్వామిత్రుల ప్రణయము సీతారాముల ప్రణయమున కాదర్శమగుటలో ఎట్టి అనౌచిత్యము లేదనునది పిండితార్థము.

వచ్చిన వసంత మట్లే పదేండ్లు సాగినది. అప్పుడు విశ్వామిత్రుని కన్నులు తెఱపిడి పడినవి. ఏల తెరపిడి పడినవో మూలమున లేదు. మేనక గర్భిణియైనది. విశ్వామిత్రుని కామోపభోగముల కంతరాయ మేర్పడినది. తన జారుపాటు మేనకయందు కనులకు గట్టినట్లైనది. విశ్వామిత్రునకు జ్ఞానోదయమైనది ఇచట భారతాంతర్గత కథను విశ్వనాథ రామాయణకథ కంటుగట్టినాడు. పదియేండ్లు వ్యర్థమైపోయినవే యని పరితపించినాడు విశ్వామిత్రుడు. పదియేండ్లను కాలజ్ఞానమెట్లు కలిగినది? ఆశ్రమ పురస్థ తరుణ నారికేళ వలయంబులు లెక్కించి కాలగమనమును తెలిసికొనగలిగినాడని విశ్వనాథ కల్పన.

తన తపస్సునకు భంగము కలిగించిన మేనకను ఆమెను ప్రోత్సహించిన దేవేంద్రుని విశ్వామిత్రుడు శపించియుండవలసినది. మరొక పర్యాయము తనను మోహపెట్టజూచిన రంభను శపించినాడు. కాని ఈ సమయమున శపింపలేదు ఏల?

'ఎల్లరును దోసము నాదగు నుల్లంబున నున్నది. ఎవరినో శపియింపన్ జెల్లదు.' అని ఆత్మవిమర్శ చేసికొనినాడు. దేవేంద్రుని తప్పులేదు.

'అల్ల త్రిశంకునాటి పగ
యంతయుఁ దీర్చెను నాకరాజు; అతఁ
డెల్ల తపంబునందు ఘటి
యించును విఘ్నము స్వర్గరక్షకై,
చెల్లును న్యాయమై యదియు.'

అని సరిపుచ్చికొనినాడు. ఇక మేనక?

'చేడియ మేనకదేమి తప్పు? తానల్ల సుపర్వ రాజునదు పాజ్ఞలో నిది యెంత చూచినన్.'

విశ్వామిత్రుని ఈ క్షమాగుణము అపురూపమైనది ఇంతటి శాంతి అతని కెట్లబ్బినది? దానికి మేనకయే కారణము దేవేంద్రుని యానతిపై విశ్వామిత్రుని తపోభంగమునకై వచ్చినదైనను మేనకకు విశ్వామిత్రునిపై నిజమగు వలపు కలదు ఆమెకు స్వామికార్యము స్వకార్యము కలసివచ్చినవి. కనుకనే విశ్వామిత్రుడు

పనియేమో దేవతలది,
వనితా కూలికిని గాని వచ్చినయట్ల
య్యును నెడఁదలోతు లిచ్చిన
నిను నేల శపింపవలయునే మధుమూర్తీ

అని దయము ప్రీతియు జూపినాడు. తాను కామమును కోసివేసితినని ఇంద్రునకు మేనక ముఖమున కబురంపినాడు. కామమును కోసివేసిన తరువాత కూడ ఆమెను 'మధుమూర్తీ' అని సంబోధించుటందలి స్వారస్యము గమనింపదగినది 'లౌకిక భోగతృష్ణా శబలత్వము మాలిన గుండెతోఁ దపస్స్వీకృతి విఘ్నకారి.' కనుక తనకు కామము పనికిరాని దగుగాక! కాని లోకమున కది కావలసినదే. అది మధువే.

విశ్వామిత్రుని మనసిప్పుడు పరమోదారమైనది కామము నే కాదు ఈర్ష్యాద్వేషములను, క్రోధమును కూడ అతని మనసు జయించినది. కనుకనే తానింతవరకు

శత్రువుగా నెంచిన, హతముగావింప నెంచిన వశిష్ఠునియెడ గల మాత్సర్యమును వీడి; ఆ 'బ్రహ్మసూమాని'ని బ్రహ్మనిభుడనియు యోగీశ్వరుడనియు, క్షమాసదనుడనియు మనసార పొగడినాడు. అట్టి బ్రహ్మర్షితో బద్ధవైరుడయిన తన అవివేకమును నిరసించుకొనినాడు. కామము, క్రోధము విడువని మూఢుడను నేనా ఆ మహాత్ముని సాధించునది? అని తనను తాను చీకొట్టుకొనినాడు.

విశ్వామిత్రు డింతటి ఉదాత్తహృదయుడెట్లయినాడు. అతని కీ జ్ఞానోదయ మెట్లు కలిగినది? జ్ఞానోదయము ననుగ్రహించిన గురు వెవరు? మేనకయే. అతడే ఇట్లనుచున్నాడు. 'నాకును నీవొనర్చిన ఘనం బగు మే లెటువంటిది?'

'కోరి ప్రత్యక్ష మన్మథ గురువువైతి;
కోరక పరోక్ష వైరాగ్య గురువువైతి;'

*    *    *    *

'అవలం కోకిల యేమెం నా కర్థమయ్యె
నీ కృపాలేశమునం జేసి నీరజాక్షి'

'ఇంక నే కోకిల కూంత నాదయిన
గుండియ లాగదు నువ్వె!'
'లంజియా! యెంత క్రిందికి లాగినావో
యంత పైకిని జనుమార్గ మరసినావు.'

మేనక విశ్వామిత్రుని తాత్కాలిక అవనతికి కారణమైనది. శాశ్వత అభ్యున్నతికిని కారణమైనది. ఇది మేనకా విశ్వామిత్ర ప్రణయమునకు విశ్వనాథ వ్యాఖ్య. 'నా కల్పవృక్షము వాల్మీకమునకు భాష్యము' అని విశ్వనాథ అభిభాషణ.

'కామిగాని మోక్షగామి కాడు!' ఇది సిద్ధాంతము.

—•••—

# తాంబూలము

— భాషాప్రవీణ శ్రీ ఎస్. ఎస్. ఆర్. మోహనశర్మ.

---

పరంధామయ్యగారూ! అమ్మాయి వివాహ ప్రయత్న మెంతవరకు వచ్చిందండీ? అంటూ పలకరించాడు మూర్తి హడావిడిగా వెళ్తున్న పరంధామయ్యగార్ని. పరంధామయ్య క్షణకాలం ఆగి ముఖంమీది చెమట తుడుచుకుంటూ, ఓ! మూర్తిగారా! రండి! రండి! మీరింకా కనబడలేదే! అని అనుకుంటున్నా. అమ్మాయికి బెజవాడవారి సంబంధమే కుదిరిందండీ! తాంబూలాలుకూడ పుచ్చుకున్నాం. అన్నారు సంతోషంగా. ఐతే యిక పరవాలేదు లెండి. మరి లగ్నాని కెప్పు డొస్తామన్నారూ! అంటూ వారిరువురు మాట్లాడుకుంటూ నడక సాగించారు.

ఇలా యేనోట విన్నా, యేకార్యంలోనైనా తాంబూలానికి ఎంతో ప్రాధాన్యం కనిపించడం మనం గమనిస్తూనేవుంటాం. చిన్న పేరంటాల నుండి, వివాహాది శుభకార్యాలవరకు లెక్కించి చూస్తే తాంబూలములేని చోటే లే దనిపిస్తుంది. దీని కింత ప్రాధాన్యం వేదకాలంనుండీ ఉన్నట్టుగా మానవ మంత్రశాస్త్రం చెబుతూనే వుంది. తాంబూల చర్వణము ఆరోగ్యరీత్యా యెంతో శుభదాయక మంటున్నది ఆయుర్వేదం. రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు కప్పురపు విడెములతో కమ్మనైన కవిత్వాన్ని వెలయించారు కవిశ్రేష్ఠులు. ఇలా యెన్నెన్నో తీరులలో మేల్తరంగా భాసిస్తున్న దీనిని గురించి విపులంగా తెలుసుకుందాం.

ఆయుర్వేదంలో :-

అసలు తాంబూల మనగానే దానిలో వేసే ఎన్నో రకాల సుగంధద్రవ్యాలు జ్ఞాపకం వస్తాయి. తమలపాకులు, వక్కలు, సున్నము, జాజికాయ, జాపత్రి తక్కోలాలు, పచ్చకర్పూరం, లవంగాలు, యాలకులు, కాచు, కస్తూరి మొ॥ ముందుగా ఆయుర్వేద శాస్త్రాన్ననుసరించి యీ వస్తువులు ఏలాగు వుపయోగపడతాయో పరిశీలించుదాం.

తమలపాకులు మంచివిగా ఎంచుకొని వాటిని చక్కగా తుడుచుకోవాలి అందువలన ఆకులపై వుండే క్రిముల అండములు తొలగింపబడతాయి. తదుపరి ఆకులోని తొడిమను ఈనెలను తొలగించాలి. ఇవి జీర్ణగుణమును చెడగొడతాయి గనుక వీనిని తొలగించడం ముఖ్యం. తమలపాకులకు కఫాన్ని తొలగించే గుణం కూడ వుంది. అందువలన వైద్యశాస్త్రంలోకూడ దీని యుపయోగం ప్రచురంగా వుంది.

వక్క :- పల్చనైన వక్కను తీసికొని దానిలోని సుంకను తొలగించి (వక్క మధ్యలోని గుడ్డువంటిది) ఉపయోగించాలి. వక్క రక్తాన్ని విరుస్తుంది అంటుంటారుగాని యిది జఠరరసాన్ని వృద్ధిపొందించి ఆహారము జీర్ణమగుటకు తోడ్పడుతుంది. సువాసనతో కూడిన వక్కను (వక్కపొడిని గాని) వాడటం మంచిది.

ఇక ముత్యాలను పొడుంచేసి దానిని సున్నంగా వాడటం మంచిది. అది మిక్కిలి ఆరోగ్యమును కలిగిస్తుంది;

కాచు :- ఇది సున్నపు ఘాటును తగ్గించి నిదానముగా పనిచేయునట్లు చేస్తుంది. లవంగం మొగ్గలను వేసుకోవాలి. లవంగముపై నున్న బుడిపిని తొలగించాలి! మిగిలిన సుగంధద్రవ్యాలను యథాశక్తి వాడటం మంచిది.

మొత్తం తాంబూలంతో ఉదయకాలంలో వక్క యెక్కువగాను, మధ్యాహ్నం సున్నం యెక్కువగాను, రాత్రియందు ఆకులు ఎక్కువగాను వేసికో

వాలి అంటున్నాయి 'చరక' కాది శాస్త్రాలు

వేసుకోనే విధానం –

ముందుగా ఆకు వేసుకొని తరువాత వక్కను వేసుకోవాలి అవి నమలగా మొదట వచ్చిన రసము విషతుల్యము. రెండవతూరి వచ్చిన ఉమ్మి శరీరమునకు నీరసమును కలిగిస్తుంది అందువల్ల రెండు పర్యాయములు ఉమ్మిన పిదప మిగిలిన సుగంధద్రవ్యాలను వేసుకొన్నచో తాంబూలము మనలను మధురభావల హారులలో ఓలలాడించగలదు.

తాంబూలము వగరుగా నుండుటచే దంతపుష్టి, ఉష్ణత కలిగించడం వలన ఉల్లాసముగా వుండటం; కలుగుతాయి. ఆకలి, వీర్యవృద్ధి, రక్తవృద్ధినికూడ కలిగిస్తుంది అంతేగాదు మలబద్ధకమును పోగొట్టి బుద్ధిశక్తిని పెంచుతుందికూడ.

మామిడిపండు, పాలు, అరటి, తేనె మొదలగునవి సేవించిన తరువాత ఒక గడియవరకు తాంబూలము వాడకుండుట మంచిది గాయములు తగిలినప్పుడు దీనిని వాడినచో నిది రక్తప్రసరణము నధికము చేసి రక్తనష్టమును కలిగించును. మూర్ఛవ్యాధిరోగం, చర్మరోగములు గలవారు తాంబూలమును వాడకుండుట యెంతో మంచిది కనుక దీని యోగ్యతాయోగ్యతల ననుసరించి దీనిని వాడటం ఆరోగ్య హేతువు.

మంత్రశాస్త్రంలో –

పూగీఫలైః సకర్పూరైః
నాగవల్లీ దళైర్యుతం।
ముక్తాచూర్ణ సమాయుక్తం
తాంబూలం ప్రతిగృహ్యతాం॥

అని దేవతాపూజలో అనవరతము ...న బడుచున్నది కర్పూర సమ్మిశ్రితమై ముత్యభస్మముతోగూడిన తమలపాకులను దేవతాప్రీతికై సమర్పించుట యాచారము దేవీపూజలో "ముఖం సువాసితం కృత్వాపూజయేత్" అని గలదు. ఆ సువాసితత్వము తాంబూలపు ఘుమ ఘుమయే కొందరు సరదాగా 'జరదా' వంటి నిషాపదార్థములనుకూడ వాడుదురు. దీనివలనకూడ ఒకవిధమైన ఏకాగ్రత, తద్వారా భక్తి, నిష్ఠ గలుగునని కొందరి భావన. దైవప్రసాదముగా తాంబూలము నిచ్చుటయు సంప్రదాయముగా గలదు.

కవులవాక్కులలో

ఆంధ్రసాహిత్యంలో కవులు తాంబూలాన్ని, వీడ్యము, విడెము, విడ్యము, వీటి, వీటిక, మొదలగు పేర్లతో వాడారు. మందయానలచే అందమైన రీతిలో తాంబూలాన్ని స్వీకరించే నేర్పు అల్లసాని పెద్దనగారికి గలదని "నిరుపహతి స్థలమ్ము, రమణీప్రియదూతిక దెచ్చియిచ్చు కప్పురవిడెము" అను పద్యము దెల్పుచున్నది "తెనాలి రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యములో సత్కృతి రచించుటకై తన కిచ్చిన తాంబూలాన్ని వాణీదేవి అధరాలతోను, చెక్కులతోను, పలుక్కులతోను, పోలుస్తాడు గమనించండి

"పలుకుందొయ్యలి మోవికాంతి కెనయౌ
బాగాలు నయ్యంతి చె
క్కులబోలుం దలనాకు లయ్యుడి ప
లుక్కుల్ వంటి కప్రంపు, బ
లుక్కులతో గూడిన వీడియంబొసగె

ప్రతి సత్కృతియందును తాంబూలము ప్రత్యక్షమగుట అనుస్యూతముగ నాటినుండి నేటివరకు వచ్చు ఆచారము ధృతరాష్ట్రుడు పాండవదూతయైన పురోహితుని సత్కరించి పంపినట్లు భాగవతమున గలదు "సతం సత్కృత్య కౌరవ్యః ప్రేషయామాస పాండవాన్" అను మూలము నాధారముగా గొని తిక్కన "నీవు మున్నేగుమని యతనికి విభూషణాంబరమ్ములతో తమ్ములంబు బెట్టి వీడుకోలిచ్చి పుచ్చెన" అని వ్రాసినాడు. అంతేకాక యుద్ధమునకు ముందు ధర్మనందనుడు" తాంబూలాభరణంబు లిచ్చి వీడుకొల్పినట్లు గలదు." పలుదోమి నేయుం విడికుము.. .వెల యింతని చెప్పరాదు" అంటాడు సుమతీ శతకకర్త కేవలం తాంబూలపు నిష్ఠీవనము వలన నేకదా గయోపాఖ్యాన నాటకమంతయు నడచినది ? ఇలా యెన్నో కావ్యాలలో తాంబూలపు ప్రాశస్త్యము కన్పడుతోంది.

ప్రణయంలో

అందాలసుందరి మందయానంతో చేతివేళ్ళతో తమలపాకులు చిలకలుగా చుట్టుకొని ప్రియునినోటి కందించడం సర్వజన విదితం. తాంబూలచర్వణంతో ఎఱ్ఱబడిన అధరాలు కామవిలాసాలతో ఉద్దీపనాన్ని కలిగిస్తా యని శాస్త్రం చెబుతోంది. కళాపూర్ణోదయంలో పింగళిసూరన, ప్రియుని సేవించే విషయంలో "కప్పురపుబాగాలీరాదో, యాకును మడచి యీరాదో" అని సుగాత్రిక చెలులచేత చెప్పిస్తాడు.

ఇతరాలు .

తమిళనాడులో దీనిని "వెత్తల పాకు" అంటారు. వారు దానిలో సుగంధద్రవ్యాలమాట యెటున్నా పాకం బట్టిన పొగాకును (తంగభస్మం) వాడుతారు. అచట తాంబూలము వేయని నోరు మనకు కనబడదంటే అతిశయోక్తి కాదేమో ! మనవారిలోకూడ పండ్లు పూడిన తాతయ్యలు సైతం తాంబూల సేవనార్థం 'కుట్నీ' (చనపరోలు, రోకలి) అను వాడుతుంటారు మరి యీనాడు కిళ్లీకొట్లలో చూస్తే రకరకాల పేర్లతో పదిపైసలనుండి పావలా వరకు విలువగల కిళ్లీల బోర్డులు సాక్షాత్కరిస్తుంటాయి ఇలా యెన్నో విశేషాలకు మూలకందమైన యీ తాంబూలమును యుక్తాయుక్తములతో సేవించుట మంచిది.

— —

# జాషువా గారి ఎలెజీ - 'బాపూజీ'

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం ఏ

'కదలక నిల్చి నా వెనుక
  గచ్చబిగించి స్వరాజ్యయాత్రకున్
గదలు డహింసయే నిశిత
  ఖడ్గముగా నడుగడ్గు విఘ్నపుం
గదుపుల నుత్తరించి చర
  ఖా శుభగీతము లాలపించుచున్
ముదుసలి దేశమాతకు బ్ర
  భుత్వ కిరీట మలంకరించెదన్,'

అంటూ సత్యాగ్రహోద్యమశంఖారావం పూరించి, స్వాతంత్ర్య సముపార్జనకై నడుం బిగించి, దేశ ప్రజలనందర నొక్క త్రాటిపై నడిపించి, బ్రిటిషువారిపాలన నుండి దాస్యవిముక్తి గావించి ఆ సమరంలో ఆసువు అర్పించిన మహాత్ముడు బాపూజీ

నేడు ఆ మహనీయుని సంస్మరించడం మన అందరి కర్తవ్యం.

బాపూజీ మరణంపట్ల కలిగిన శోకావేశాన్ని ఒక 'ఎలిజీ' (స్మృతికావ్యం)గా రూపొందించిన వారిలో నవయుగ కవి చక్రవర్తి జాషువా ప్రముఖుడు

ఈ 'ఎలిజీ' పాశ్చాత్య కవిత్వంలో అత్మాశ్రయ-కోవకు చెందిన ఒక ప్రక్రియ 'ఆప్తుల మరణాన్ని గూర్చి స్మృతిరూపంగా వెలువరించేది ఎలిజీ అని చెప్పవచ్చు (The elegy is a lyric expressive of melancholy or grief in particular, when Commemorative of dead friend,—
(Encyclo America- Vol 17)

ఇది సాధారణంగా ఏసతీసుత మిత్ర బాంధవాదుల మరణం విషయంలోనో కవికి కలిగిన శోకావేశాన్ని వ్యక్తం చేస్తుంది (Sometimes death is the inspiration and sole theme, at other times it is merely the common starting point from which poets have launched various themes, speculations on the nature of death and the here after tributes to friends the poets own mood even literary criticism— The study of poetry A R Entwistle)

దీనినే కోలరిజ్ మహాశయుడు 'ఆలోచనాపరమైన మేధస్సుకు సహజసిద్ధమైన కవితారూపం'గా పేర్కొన్నాడు

(The form of poetry natural to the reflective mind)

గ్రీకుభాషలో 'ఎలిగాన్' అంటే శోకం గ్రీకువారు మొట్టమొదట మృతదేహానికి జరిగే దహనసంస్కారక్రియలో ఒకభాగంగా సంగీత సహితంగా చేసే మంత్రోచ్చారణను అది 'Elegiac' విధానంలో ప్రకటించినప్పుడు దానినే 'ఎలిజీ' అన్నారు (' the only restriction being apparently that it must be written the elegaic messure, a district composed of a declylic pentamuter—'Norman Hopple—The English Lyrical Forms - P 165)

ఎలిజీకి 'ఆవేశం, వ్యక్తీకరణల పూర్తి నిజాయితీ పునాది' అని హడ్సన్ అభిభాషించాడు (Its' basis is absolute sincerity of emotion and expression,)

ఈ 'ఎలిజీని' తెలుగులో 'కారుణ్య'మన్నారు తొలివారు దీనినే మళయాళంలో 'విలాపగీతం' అనీ, కన్నడంలో 'శోకగీతం' అనీ పిలుస్తారు అయితే తెలుగులో నేడు దీనిని 'స్మృతిగీతం' అనడం పరిపాటి అయింది

ఇట్టి కోవకు చెందినదే 'బాపూజీ' కావ్యం 'జాతిపిత' అయిన గాంధీమహాత్ముడు గోడ్సే చేతిలో మరణించాడు. ఆ సందర్భంలో కవి

'భగ్గునమండు నీదు నర
  పాలురతోడ నెదిర్చి వెన్కకున్
దగ్గక రక్తపుం జినుకు
  నష్టముగాని స్వరాజ్యయుద్ధమున్
నెగ్గినపట్టి భారతము
  నిప్రవరుండు క్షమాప్రవాసియా
మగ్గినపండు, బోనమయి
  పోయెనె నేడు తుపాకిగుండ్లకున్.
(పు. 2)

అని వాపోయాడు.

దేశస్వాతంత్ర్యం వచ్చిన తరవాత ఆరునెలలు తిరగకుండానే పూజ్య బాపూజీని మతశక్తులు పొట్టను బెట్టుకున్నాయి అందుకే స్వరాజ్య రక్షణభారం మీద పడిన 'శతాయుష్మంతులు' ఆబరువు మోయగలరో లేరో అని అనుమానించాడు కవి. నూటముప్పదేళ్ళు జీవిస్తాడని జ్యోతిష్కులు చెప్పినమాట నీటిమూటగా మారి గాంధీజీ అనుకోకుండా కన్నుమూయడంతో భరతమాత నిరాధార అయింది. అందుకే 'భరతరాజ్ఞీ! యెంత దౌర్భాగ్యవో!' అని కవి అంటాడు

ఇదే సందర్భంలో ఏర్పడిన విషమ పరిణామాలను వివరిస్తూ కవి —

'ఆగిపోయెనె ప్రపంచానందదంబైన
ఖదరురాటాల ఝుంకారరవళి
ఇంకనే శాశ్వతాస్పృశ్యుల నోదార్చి
సెనరూను వేడికన్నీటిబుగ్గ
పడిపోయెనే నేటివరకింతలభియించు
గండుపేదల నోటి కబళరాశి
విరిగిపోయెనే నేటివరమంత్రికోటికి
నవలంబనంబైన యమరతరువు
గంటకొట్టినమాదిరి మింటియందు
మండుచున్నాడు చండమార్తాండమూర్తి
భారతజ్యోతిగప్పిన నారిపోవ
ముజ్జగంబున జీకటి ముమ్మరించె'
(పు 3)

నని దుఃఖిస్తాడు.

ప్రజలకోసం బలిఅయిన గాంధీని 'కలి కాలంలో ఏసుక్రీస్తు'గా కొనియాడారు. విష్ణువు ఎన్నో అవతారాలెత్తినా డని మనశాస్త్రాలు చవులూరిస్తున్నాయి కాని 'సాక్షాదబ్జనాభుండు' గా అవతరించిన మహనీయుడు గాంధీ అని జాషువా అభి ప్రాయం

'గోచిపాత గట్టుకొని జాతిమానంబు నిలిపినట్టి ఖదరు నేతగాడు గాంధీజీ, బ్రిటిషు రాజుల దోపిడీకి వ్యథ చెందు జాతిలో 'దీపంబు పెట్టిన దినకరుడు', మానవత్వం గూర్చి భూమండలమంతటా చాటిన 'ఆచార్యచక్రవర్తి', సత్యాగ్రహ మనే శస్త్రాన్ని భువికి దెచ్చిన 'మహా పురుషమౌళి', నిమ్నజాతుల కన్నీరు తుడిచిన 'నిఱుపేదబాంధవుడు' పండ్లు నూఱుతున్న పెక్కుమతాల్లో సహన విద్య నేర్పిన 'సాధకుడు' బాపూజీ అందుకే అటువంటి మహాత్ముని మరణా నికి 'కలముల్ కైతలు మూగవోయిన' నంటాను కవి. వేయేళ్ళు తలక్రింద యినా అట్టి 'వింతగోసాయిసామి'ని భరతమాత మళ్ళీ పొందడం దుర్లభం. ఆయనను పొట్టబెట్టుకున్న 'మతమత్త చిత్తులతలల్ ఖండించి కాల్పించినా' ఈ గాయంమానదు. అందుకే కవి శోకా వేశంతో_

'అవతరించిన స్వరాజ్యప్రాజ్యబాలిక
కక్కటా! మునుపచ్చలారలేదు
సకుటుంబముగ వీడిచనుచున్న తెలిరాజు
నిజసీమలో కాలునిలుపలేదు
హస్తినాపురిమీద హైందవధ్వజమెత్తి
నిండుగా యేడాదినిండలేదు
స్వాతంత్ర్య ఘనమహోత్సవ
జయధ్వానంబు
మాఱ్రోగ్రత లూఱూర మాయలేదు
సింహపీఠికనధివసించిన యనుంగు
మనుమలం జూచుకొనుచున మందహాస
పులకితస్వాంతుడగు దొడ్డముసలివాడు
మాయమయ్యెనె! లోకాలగాయ
మగుచు (పు. 8)

అని వర్ణిస్తాడు.

ఆయన మరణవార్త 'భారతగర్భ కుహరి'లో కత్తులాడించింది ఆరక్త సిక్తాంగుడైన బాపూజీ వీరస్వర్గం అలంక రించడంతో దేశం మొత్తం ఆబాలగో పాలం 'ఆకారమెత్తిన శోక'మయింది. ప్రకృతి నిర్జీవంగా 'ముగ్ధమై'పోయింది. స్మృతి చిహ్నాలుగా మిగిలిన ఆయన 'చెప్పులు, కఱ్ఱయు, నన్నుపుచిప్ప, సులోచనములు'ఉన్న గృహంశూన్యంగా దుస్సహంగా కనిపిస్తుంది ఇప్పటికీ

గాంధీజీ చితిమండుతుంటే 'పడమట చండకరుని చితి'కూడ మండింది ఆయన చితాభస్మాన్ని ద్వాదశ పుణ్యతీర్థాలూ తరంగహస్తముల ముద్దిడి 'ఆణిముత్యాల గాదెల్లో నింపుకున్నాయి' భద్రంగా.

'ఏజన్మాంతర పుణ్యశాలుల తనూమ్ర త్సంచయంబంది యారాజాఘట్టము ధన్యమయ్యెనో'గాని అది బాపూజీ సమాధి గలిగి ఒక 'సుక్షేత్రమై' నేడు ఒప్పా తున్నది.

ఇదే సందర్భాన్ని పురస్కరించుకొని కవి బాపూజీ స్వాతంత్ర్య సమరంలో నిర్వహించిన విదేశవస్త్రబహిష్కరణం, ఉప్పుసత్యాగ్రహం, సహాయనిరాకరణో ద్యమం, నిరశనవ్రతం, క్విట్ఇండియా ఉద్యమం వంటి ముఖ్యఘట్టాలను వివ రించారు

బాపూజీ ఇచ్చిన సందేశాలలో నాటికీ నేటికేకాదు ఎప్పటికీ పనికివచ్చే గాంధీజీ గీతోపదేశం ఏమిటంటే

'కులములు మెట్లుగా మలచి
గొప్పతనా లను గోపురాలపై
నిలిచి, యవిద్యలోపల మునింగిన
నాలుక లేని తమ్ముగు
ఱ్ఱల నోం తల్లిపిల్లల చిరంతన
వత్సలతా సుఖంబులో
కలతలు వెట్టువారి కధికారము లేదు
స్వారాజ్యపీఠిపై' (పు. 31)

ఈఉపదేశం మనప్రజానాయకులు వింటే దానిప్రకారం ప్రజలు నడుచుకుంటే దేశం సుభిక్షంగా ఉంటుంది పదికాలాల పాటు. లేకపోతే కులాభిమానంతో, జాత్యహంకారంతో, మతావేశంతో చెలరేగే విధ్వంసకాండకు అంతంలేదు. అంతవరకూ గాంధీజీవంటి మహాత్ముల ఆత్మలకు శాంతి లేదు!

లేదా మళ్ళీ మరో మహాత్ముడు పుడ తాడు! ఉద్యమంనడుపుతాడు తప్పదు. 'సంభవామి యుగే యుగే'

'ఉద్యమములు సత్తులుత్తుత్తమాటలు
ఫలితమునకు రావు వాస్తవముగ
త్యాగులైనవారి తనురక్తమున దక్క
సాధురక్తమునకు జయము ధ్రువము!'

—0—

# జానపదుల ప్రణయం

— శ్రీ కె. వి రమణారావు, ఎం. ఏ

పండితుల - లోకనాడు పిచ్చిపిల్లలా కనబడిన జానపద సాహితీ సుందరి నిండు జవ్వనపు ముగ్ధలా కనబడుతుంది నేడు. జానపద సాహితీసుందరి ఎప్పుడూ నిండు జవ్వనపు ముగ్ధయేకాని, కృత్రిమాలంకారాలతో మిలమిల్లు గొలిపే శిష్ట సాహిత్య కన్య కులుకులొలుకబోస్తుంటే పండితులకు జానపద సాహితీసుందరి పిచ్చిపిల్లలా కాకుండా యెట్లా కనబడుతుంది? ఇంతకీ జానపద సాహితీసుందరి ఎవరు? దాని అందచందాలేమిటి?

జనపదమనగా పల్లెటూరు లేదా గ్రామము జానపదులనగా పల్లెటూరివారు గ్రామీణులు. పల్లెటూరివారు పాడుకొనెడి పాటలే జానపదగేయాలు. ఈ గేయాలలో మూర్తీభవించిన సుందరియే జానపద సాహితీసుందరి.

జానపద సాహిత్య మను పేరు దీనికి తగదని కొందరు పండితుల అభిప్రాయము. అంతేకాక వీరు చూపిన కారణాలు పల్లెటూరివారు సాధారణంగా మోటువారు, అనాగరికులు, పామరులు, ప్రాకృతులు, అజ్ఞానులు అని అంటూ వేరే ఈ సాహితీ సుందరికి ఒక్కొక్కరు ఒక్కొక్క పేరు పెట్టారు ఒకరు 1 ప్రజావాఙ్మయ మన్నారు. మరొకరు 2 పదవాఙ్మయ మన్నారు. ఇంకొకరు 3 అనాదృత వాఙ్మయ మన్నారు. మరొకరు 4 గేయరచన అని వేరొకరు 5 మధుర కవితలని మరొకరు 6 దేశి సారస్వత మని పేర్కొన్నారు ఎవరెన్ని పేర్లు పెట్టినను ఈ సాహితీ సుందరికి జానపద సాహిత్య మను పేరే సరియైనది. అయితే ఈ పేరునందునూ లోపములు లేవా? అనినచో దోషరహితమును, సర్వసమ్మతము నగు మఱొక పేరు దొరకునంతవరకు ఈ పేరే సమంజసమైనది.

జనపదాలలో పుట్టి పెరిగి అనుశ్రుతంగా వస్తూన్న సాహిత్యమే జానపద సాహిత్యము వ్యాకరణము, ఛందస్సులు దానిని పోకుండా జానపదులు వారి భాషలో వారి కర్థమయ్యే రీతిలో చక్కగా పాడుకోడానికి వీలుగావుండే పాటలను కల్పించుకొని పాడుతూ వుంటారు. ఆ పాటలే జానపద గేయాలు. ఇట్టి జానపద గేయాలలో ప్రణయ గేయాలు లేదా శృంగార గేయాలు ఒక విభాగం.

జానపదపు పాటలే విరిమల్లెల తోటలు. ఆ విరిమల్లెల గుబాళింపు రసజ్ఞులైన ప్రతి తుమ్మెదకు తెలుసు అందులో శృంగార రపు పాటలు ఎంత చక్కనివో కమ్మనివో? 'శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనో రసః' అని ఆనందవర్ధనుడు శృంగారానికి పట్టము కట్టాడు సుమారుగా ప్రపంచము నందలి అన్ని భాషల లోను శృంగారము ఎక్కువగా చోటు చేసుకున్న దని చెప్పవచ్చును దానికి కారణం శృంగారం మాధుర్యహేతువై సుఖానందపర్యవసాయి అగుటయే శిష్ట సాహిత్యంలో ఎక్కువగా శృంగార కావ్యాలున్నాయి కాని జానపదసాహిత్యంలో శృంగార కరుణాలు రెండూ సమానంగా ఉన్నాయి జీవితంలో సుఖదుఃఖాలు సమానములు కదా! జానపద సాహిత్యమే జాతిజీవన ప్రతిబింబము.

జానపదుల శృంగార సాహిత్యంలో ప్రేయసీ ప్రియులు పొందు ఆనందము, వారి ప్రేమైక జీవితధర్మాలు కనిపిస్తాయి. వీరి శృంగారంలో చందమామ, మేఘాలు, చల్లగాలులు, సరసాలు, సల్లాపాలు, చూపులు, రూపులు, ఝుమ్మనే తుమ్మెదలు, రేమ్మనే పద్మాలు అన్నీ ఒకటేమిటి చాల చోటు చేసుకుంటాయి.

ఒక యువకుడు పోతూపోతూ ఒక యువతిని చూసాడు. చూడగనే ఆ యువతిపై ప్రేమ కలిగింది. ఆమెను చూసి ఏమంటున్నాడో చూడండి

"పొట్టిదానికి మట్టె లందం
పొడుగుదానికి గాజు లందం
నాగుబాముకు నడుము సన్నం
నెమలిపిట్టకు పింఛ మందం
తకజనత తకధిమితా ..!"

ఈ పాటలో కొన్ని అలంకారాలు వివరించబడ్డాయి. పొట్టిదానికి మట్టెలైతే, పొడుగుదానికి గాజులట అందం మరి యీ చిన్నది పొట్టిదో? పొడుగుదో?

ఆ పాట విన్న చిన్నదానికి అతనిపై మోజు కలిగి ఏమంటుందో చూడండి.

"సిట్టిపొట్టి సిన్నివోడా
సిన్నిదాన్ని సూసినావా
గుట్టులేక మట్టువిప్పి
గుటకలేసి మ్రింగినావా:
సెట్టుసాటు సున్నదాన్ని
సద్దు సేయద్దురో
బావా నా బావా...!"

పొట్టివాడు గట్టివాడు కదా! అందుచేతనే తన ప్రియుణ్ణి సిట్టి పొట్టివాడంటుంది. తానే ఆ యువతిని చూసాననుకొన్నాడా సిట్టిపొట్టివాడు. కాని ఆమె అతనికంటే తెలివైనది. గొడవ చేయకుండా చెట్టుచాటు కొచ్చేయమంటుంది. వీరి శృంగార మింత బాహాటంగా ఉంటుంది జానపదులు అరమరికలు లేనివారు కదా!

తన బావను ఆటపట్టించాలను కొంటె కొక గడుసరి. సాధారణంగా తాను మెచ్చిన స్త్రీ మరొక పురుషుణ్ణి గురించి ప్రేమగా మాట్లాడితే అతడు భరించలేక ఉడుకుమోత్తనము, కోపము, ప్రకటిస్తాడు. అట్లాగే స్త్రీ కూడ.

ఈ క్రింది పాటలో బావను ఎలా ఆటపట్టిస్తుందో చూడండి.

"ఒకరికి చెయ్యినిచ్చి!
ఒకరికి కాలునిచ్చి!
ఒకరికి నడుమునిచ్చి!
కూకున్నానోయ్ రాజా!
కూకున్నానోయ్!"

అనేసరికి బావగారికి ఎక్కడలేని కోపము ముంచుకొచ్చేసింది. ఆ కోపంలో ఏమంటున్నాడో చూడండి.

"ఎవరికి చెయ్యినిచ్చి!
ఎవరికి కాలునిచ్చి
ఎవరికి నడుమునిచ్చి।
కూకున్నావోలె జాణ!
కూకున్నావే!"

ఈ ప్రశ్నల కామె ఎంత చక్కగా చమత్కారంగా సమాధాన మిస్తుందో.

"గాజులకు చేయినిచ్చి।
అందెలకు కాలునిచ్చి
వడ్డాణానికి నడుమునిచ్చి।
కూకున్నానోయ్ రాజా!
కూకున్నానోయ్...!"

అరె! అని పెదవి కొరుక్కున్నాడు అంతటి బావ. ఆ బావే కాదు ఏ బావైనా పెదవి కొరకక తప్పదు. ఈ పాటలో బావ చాల తెలివి తక్కువవాడు. తొందరపాటు గలవాడు. అసలు జానపద సాహిత్యంలోనే స్త్రీ చాలాచోట్ల తెలివైనదిగా కనబడుతుంది.

కొన్నిచోట్ల పురుషుడుకూడ తెలివిగా ప్రవర్తిస్తుంటాడు. ఒక స్త్రీ మొగుడుండగా మరొక పురుషుడితో 'తప్పుడు సంబంధం' పెట్టుకొంది. ఒకనాడు వాళ్ళిద్దరూ మన్మథ క్రీడలో పాల్గొన్నారు. అది భర్తకు తెలిసిపోతుందేమో అని ఆమె భయం. దానికా రసికు డిచ్చిన సమాధానాలు చూడండి.

స్త్రీ: "కాలిమట్టెలు పోయెను। చినవాడ
రాజడిగి తేమందునూ!
పు: మనగడప పెద్దదనుమో! చినదాన
గడప తగిలిపోయెననుమా!
స్త్రీ: చేతిగాజు పోయెను! చినవాడ
రాజడిగి తేమందునూ!
పు: సెనగపూరేకలనుమో। చినదాన
చెయిజారిపోయె ననుమా!
స్త్రీ: ఒళ్ళెల్ల రక్కులయ్యె। చినవాడ
రాజడిగి తేమందునూ!
పు: మన యిల్లు చీకటనుమో! చినదాన
మన పిల్లి రక్కలనుమా!
స్త్రీ: నొష్ట బొట్టు పోయెను। చినవాడ
రాజడిగి తేమందునూ!
పు: చిరుచెమట లెక్కె ననుమో! చినదాన
చెమటకు కరిగెననుమా!"

కాలిమట్టెలు పగిలిపోవడం, చేతిగాజులు పగిలిపోవడం, ఒళ్ళంతా రక్కులవడం, నుదుటి బొట్టు పోవడం వారి శృంగారానికి పొందిన బహుమానాలు. కాని ఇవి కావాలె. ఆ కాపాలకు ప్రాయశ్చిత్తం ఆ రసికుడే చెపుతున్నాడుగ!

జానపదులు సాధారణంగా చిన్న వయసునుండి ప్రేమించుకుంటారు. కొంత వయసొచ్చాక ప్రియుడు పట్నం వెళ్ళి డబ్బు సంపాదించా లని పట్నం వెళతాడు. ఇక పల్లెలో ఈమె, పట్నంలో ఆయన బాధపడుతుంటారు. ' ఇంతలో సముద్రపు పోటులా ఆమెకు జవ్వన మొచ్చింది. కొంతకాలం జవ్వనంతో బాధపడుతుంది. ఎంతకీ బావ రాక పోయేసరికి యౌవనభారం మోయలేక అత్త దగ్గరకు వెళ్ళి ఆ కన్య ఏమంటుందో చూడండి.

"తొలకరి ఒక మబ్బు తొంగిచూసింది
మబ్బులో ఒక మెరుపు మెరిసిపోయింది
పెరటిలో ఒకజల్లు కురిసిపోయింది
........................
..................
ఏరువాకనాటి కేడాది దాటింది
ఎదురుచూచీ గుండె చెదరిపోయింది
........................
..................
బావొచ్చి నాతోటి బాసతెన్నిటాడి
ముద్దిచ్చి నాతోటి మురిసిపోవాలి"

దీనికా అత్తిచ్చిన సమాధానం ఎంత వేళాకోళంగా ఉందో

"రవికేసుకో। కమిచేసుకో
మంచాడిలో। మంచమేసుకో
వాకిట్లో దీపమెట్టుకో
రాకపోతే। కేకేసుకో"

'ఛీ' అంటూ సిగ్గుపడిపోకుండా వుంటుం దంటారా ముగ్ధ?

(సశేషం)

సూచికలు :-

1. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం.
2. శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి. అడిదము రామారావు.
8. మల్లంపల్లి సోమశేఖరశర్మ.
4. శ్రీ వావిలాల సోమయాజులు.
5. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.
6. శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి.

—...—

సాంస్కృతిక జాతీయ పక్షపత్రిక

## విజయదీపిక

శ్రీ పరిపాటి వేణుగోపాలగుప్త, ఎం. ఏ.



ఓ ఆకలి పెనుభూతమా!
మా పాలిట తీరని శాపమా!
దేవతలు అమృతం త్రాగి అమరులైనారు
మరి నీవేం త్రాగి మరణం పొందకున్నావో
బోధపడడంలేదు సుబోధకంగా!
పంచభక్ష్యపరమాన్నాలతో
చంపేస్తున్నారు కొందరు.
అయినా మళ్ళీ బ్రతుకుతున్నావ్!
గుప్పెడు గంజితో
సమాధి చేస్తున్నారు మరికొందరు.
కాని మళ్ళీ చెలరేగుతున్నావ్!
పచ్చిమంచినీళ్ళతో
నీ ప్రాణం తీసేస్తున్నారు ఇంకొందరు
అంతలోనే మళ్ళీ చైతన్యపూరిత
మవుతున్నావ్!
చంపినంత సేపూ చచ్చినట్లు పడుండి
మళ్ళీ కాస్సేపటికే కార్చిచ్చులా
రగుల్తున్నావ్!
నీవినాశనానికి ఈషణ్మాత్రం కృషి
చేయలేని
నిర్బలులను నువ్వే నిర్జిస్తున్నావ్!
నిన్ను క్షణక్షణం చిత్రవధ చేస్తున్న
నయవంచకుల్ని రక్షిస్తున్నావ్!
ఓ ఆకలి విషసర్పమా!
మానవజాతిని మసి చేస్తున్న మారణా
యుధమా!!
మా భవిష్యన్మార్గంలో ఏర్పడ్డ
అగాధమా!!!
నీలాంటి కృతఘ్నులను శతఘ్నులతో పేల్చి
మర్త్యకోటికిఁ మనుగడ నిచ్చి
వెలిగింప జూస్తున్నాను విజయదీపిక
ఇదే మానవాళికి నేనిచ్చే గొప్పకానుక.



'లలిత కవితా సౌరభాలు'

## బాపురెడ్డి గేయాలు

— శ్రీ కర్రా కార్తికేయశర్మ.



ఈనాడు ఏవారపత్రిక తెరిచినా, ఏ దినపత్రిక పుటలుత్రిప్పినా బాపురెడ్డి కవిత దర్శనమిస్తుంది. వృత్తి రీత్యా ఆయన మెదక్ జిల్లా కలెక్టరు. ప్రవృత్తి రీత్యా విరామ మెరుగని సాహిత్యశ్రామికుడు. వచనకవిత, పద్యకవిత, గేయం, ఆయనకు ఊడిగం చేస్తున్నాయి. కవిజీవిత ప్రారంభంలో వీటికై ఆయన తపనతో కూడిన కృషిచేశారు. ఇప్పుడు వాటిని తన కనుసన్నల అదుపులో పట్టి ఉంచారు. ఆయన వచనకవిత చైతన్యపతాక! ఆయన గేయం రాగరంజితం. పద్యం గతివైభవ విలాసం! ఆయన రచించిన గేయరూపకాలు గాయకుల గాత్రాల మాధుర్యాన్ని పంచి, ఆకాశవాణి ప్రతిష్ఠను పెంచాయి.

శ్రీ బాపురెడ్డి 1936వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లా సిరిసిల్లా తాలూకా 'సిరికొండ' గ్రామమున జన్మించినారు. ఆ గ్రామము ప్రకృతి సౌందర్యమునకు పుట్టినిల్లు అగుటవలనను అందు బాపురెడ్డి పసిపాపగా 'అఆ' లు దిద్దుకొనుటవలనను, ప్రకృతి సౌందర్యం ఆయన కవితలో 'అనుకోని అతిథి'గా ప్రవేశించడం, ఆ అతిథి ఆత్మబంధువుగా మారడం జరిగినవి. కవిగారి మనస్సుపై ప్రకృతి ప్రభావము ఎక్కువగుటవలననే అన్యాయాన్ని ఎదిరించడం, న్యాయాన్ని సమర్థించడం 'ఉగ్గుపాలవిద్య'గా ఆయన అలవరుచుకున్నారు. కవిత్వం ఆ కవి మనస్తత్వానికి అద్దంగనుక, ఆయన కవిత్వంలో న్యాయాన్ని, స్వచ్ఛతని, నిరాడంబరతను, ఎక్కువగా మనం దర్శిస్తాం.

'ఎవరికోసం నేను
ఇల కవతరించానో?
ఎవరికై ఈ బ్రతుకు
చివుక కలలు రే
బవలు కంటున్నానో?
ఎవరికై ప్రతిదినా
లే అల్లిపాడుదునో?' (ఎవరికోసం)

'ఎవరికోసం' అన్నప్పుడు సందర్భాన్ని బట్టి ప్రేయసి కావచ్చు, కవిహృదయాన్ని 'ఎక్స్‌రే' తీస్తే 'క్షుభితాత్ముడు' కావచ్చు. బాపురెడ్డి గేయాలలో కొన్ని గేయాలు 'భావకవి' గా ఆయనను పరిచయం చేస్తే, మరికొన్ని గేయాలు 'అరుణభావకవి'గా సన్నిహితం చేస్తాయి.

భావకవిగా ఆయనను పరిచయం చేసే గేయాలను సమీక్షిద్దాం.

'నీకన్నుల వెలుతురులో
నేకన్నులు తెరిచాను
కనులు తెరచి నేనిది భూ
లోక మనే మరిచాను.
నీకాగిలి చేరినాను
నే కన్నులు మోడ్చినాను
లోకమ్మున కోటికోటి
నాకమ్ములు చూచినాను.'
(నీవూ-నేనూ)

ఈ గేయంలో బాపురెడ్డి భావుకత్వం చదల ఎద చీల్చిందన్న అతిశయోక్తి లేదేమో! 'ఈమె కన్నుల వెలుతురులో కన్నులు తెరవడం, అతీతానంద తన్మయత్వంలో ఊగులాడి ఇది భూలోకమనే విషయం మరచిపోవడం, ఆమె కాగిలిచేరి కన్నులుమోడ్చి లోకంలోని కోటికోటి నాకమ్ములు దర్శించడం, ఉత్తమ భావకవికి కలిగే వేడివేడి అను

భావాలు' ఆ
శిఖర అధిరోహణం !

'నవవసంతానికై
అవతరించెద వంచు
నా బ్రతుకు తోట ని-
న్నాశ్ర పెంచితినే !,
స్నేహానిలములతో
చిరునవ్వు విరులతో
విరహ శిశిరమునుండి
విడిపించు నను చెలీ !'

పై ఖండిక పరిశీలిస్తే సాధారణమగు భావకవిలో గూడుకట్టుకొన్న 'అమాయికపు తొందర' కనిపిస్తుంది.

'క్షేమరసవృష్టి కురి
పింతువని ఆశించి
యుంటినీ ! నా విమల
హృదయ క్షేత్రాన
చల్లితిని మంజులా
శయ బీజములనెన్నో
ఈ ప్రవాసపు టుషా
వృష్టికడ తేర్చెదవే !' (విపద్గీతి)

ఈ పాదాలను సమీక్షిస్తే కవిలోని 'గడుసుపోకడ' అవలోకనా నవుతుంది. బాపురెడ్డి కవిత్వరహస్య మదే ! అందరికీ అందుబాటులో ఉన్న పదాలను ఏరుకొని కవితకట్టి, అందరి వాడుగా వ్యవహరిస్తూనే, 'శిల్పం' విషయంలో గడుసుగా ప్రవర్తించి కొందరివాడుగా మారిపోతారు. అందుకే ఈ నాడు తెలుగుదేశంలో బాపురెడ్డి కవిత్వానికి విపరీతమైన మోజు, ఆదరణ. ఆయన హృదయంలో పొంగినభావాలు అమాయికమైనవే అయినా కళ్ళలోకి ప్రవహించి తెలివిగా పొదిగి, కాగితంమీద రూపు దాల్చేసరికి 'రెడీమేడ్మేకప్లా' తొడిగిన ట్లౌతాయి.

'ఎన్నో ఊహలను, ఎన్నెన్నో
అనుభూతులను
జీవనిర్భర భావచిత్రాలు నిల్పగా
కలమునీరూపసత్కళ జూచి తలవాల్చి
కంపించు తన గొంతు కదుపజాలదు దేవి!'
అంగాంగమున సుధలు పొంగిపారగ నీదు
అధరపుష్పాన సంధ్యారుణిమ డాగినా
యనిపించు, ఎదుట భావము వికసించు,
ఈ సృష్టి కర్థమ్ము ఈనాటికి స్ఫురించు'
(మహోనుభూతి)

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్' అన్న కాళిదాసు శ్లోకం ఇక్కడ జ్ఞప్తికివస్తోంది. రమ్యమైన దృశ్యం చూచినా, మధురమైన శబ్దం వినినా, మానవుడు సుఖవంతుడై ఉన్నప్పటికీ తీరని వేదనను అనుభవిస్తాడు. కాగా మన మనస్సున స్థిరపడ్డ భావములు జన్మాంతర సంబంధమైనట్టివి. ఆమె రూపలావణ్యం తిలకించిన కవిగారికి అంగొంతు కదపలేని స్థితికి వచ్చిందన్న 'మూగతనం'గా మనం భావించరాదు. అదొక 'సమాధిస్థితి', తపస్సాధన ! ఆ సాధనలో ఆమె అంగాంగమున ప్రవహించేసుధలు, అధరపుష్పాన దాగిన సంధ్యారుణిమ సాక్షాత్కరించి 'సృష్టి అర్థం' అవగత మయింది. ఇంతకన్న ఏకవికైనా కావలసిం దేముంది ? రససిద్ధికి మించినవరం కవి కింకేమీ లేదు.

ఇక 'అరుణభావకవి'గా ఆయనను సన్నిహితం చేసే గేయాలను మనమిప్పుడు పరిశీలిద్దాం.

'పద్యానికి గద్యానికి మధ్య
ప్రాచీనులు పెట్టిన గోడలు
నేడో రేపో పూర్తిగ
నేలకు పడిపోవచ్చును,
దేశానికి దేశానికి మధ్య
ద్వేషాలు పెంచే తత్వం
మాయమయే కాలమెంతో
దూరంలేదనవచ్చు' (మధ్య - భేదము)

ఈ ఖండిక బాపురెడ్డి అరుణభావుకత్వానికి సాక్ష్యంగా నిలుస్తుంది.

ఆధునికకవి 'చూపు' భవిష్యత్తుపై గురిపెట్టబడి ఉంటుంది. నిన్నను పునాదిగా చేసుకొని, నేడును వేదికగా నిర్మించుకొని రేపును ఆహ్వానించే మానవఋషి ఆధునిక కవి.

---

# బ్రతుకు పడవ!

— శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ.

* కాల మెన్నంగ పరిణామ శీలముగద! బ్రతుకు క్షణికమ్ము, మరియు స్వల్పమ్ముగాదె!
మనసు చిత్రమ్ము చంచలమ్మునుగదోయి! వీనికిని బంధమును గూర్చువానిఁ దలతు॥
* కాలజలధిలో మదిని చుక్కానిగాగ, కృషిని గడకఱ్ఱగా, దైవకృప చెలిమిగ
చేసికొనుచు నావలిగట్టు చేరుకొనగ, బ్రతుకుపడవను నడుపుకోవలయు నరుఁడు॥
* కష్టసుఖముల అలలు, విశిష్టరాజకీయఘర్షణవర్షాలు కురులునపుడు
దిట్టతన మను తెరచాప దీసలెత్తి, బ్రతుకుపడవను నడుపుకోవలయు నరుఁడు॥
* అలతి యను భూతి నీలినీడలనుబట్టి, హోరుగాలుల జ్ఞాపకాల్ తీరుబట్టి
వెతల చితుకుల పచితంపుటతుకువెట్టి, బ్రతుకుపడవను నడుపుకోవలయు నరుఁడు॥
* ఆటుపోటుల కేమాత్ర మదిరిపడక, ఏటి కెదురీదకయె మొక్కవోటిగాను
సాగిపోవక కాలంపు సంభ్రమందు, బ్రతుకుపడవను నడపుకోవలయు నరుఁడు॥

'ఒకశతాబ్దానంతరం నరుం
డూహావశి నాకనుల మెరయును
ఒక వినూత్న విచిత్ర జీవిత
మును తమను కన్పరచినావును
అదిగో ఇరువదియొక శతాబ్ద
మ్మందు మనిషి మహానుభావుడు !
చూడుమా తని బ్రతుకు ఎంతటి
సుందరమ్మో ప్రచలితమ్మో !'
(భవిష్యద్దర్శనం)

పై పాదాలు పరిశీలిస్తే బాపురెడ్డిగారి దర్శమైన క్రాంతదృష్టి మనకు అవగతమౌతుంది. మనిషిని మనీషిగా ఊహించి మందిర మెరుగని దేవుడుగా పూజించి, సంభావించడం కన్న గొప్పభావన ఏం కావాలి ?

'ఢిల్లీలో ప్రతిపల్లెలో రా
జిల్లెఁ వనిర్మాణశోభలు,
గనులలో, క్షేత్రములలో కిం
కిణుల మ్రోసెను భాగ్యదేవత'

భారతదేశం అనగానే బాపురెడ్డి హృదయం చంద్రోదయ సాగరంలా పొంగిపోతుంది. ఈ దేశపు అభివృద్ధికి, పురోగతికి ఆయనకనే కలలు ఎన్నో ! ఎన్నెన్నో !

'అయిదు అయిదడుగులుగ ముందుకు
అదుగో భారతజాతి సాగెను
కాంతిచిమ్మెడి దివ్యసీమలు
కానుపించెను కనుల మేరల'
(అయిదు అయిదడుగులు)

మనం స్వాతంత్ర్యాన్ని సంపాదించిన ఈ కొద్దికాలంలోనే ఈ అభివృద్ధిని సాధించాం. ఈ అభివృద్ధి వెనుక ప్రతీ భారతీయుడి కృషి అంతో ఇంతో ఉంది. అయిదు అయిదు అడుగులుగ ముందుకు వేసి భారతజాతి పురోగమిస్తుంది. ఎక్కడికి ప్రస్థానం ? కాంతిచిమ్మె దివ్యసీమలకు! కాంతివిరిసే సౌందర్యక్షేత్రములకు.

బాపురెడ్డికి భారతదేశనేతలపట్ల ఎంతో గౌరవం అభిమానం. ఆయన మాటల్లో చెప్పాలంటే 'ఒక్క చిరునవ్వుకు నేను సహస్రార్చనలు చేయగలను. ఒక నిర్మల హృదయానికి హారతి పట్టగలను. ఒక అనురాగ భావానికి అంజలి ఘటింపగలను. పవిత్రమైన మైత్రి కోసం ప్రాణాలైనా ఇవ్వడానికి సిద్ధమే. అయితే అసురత్వాన్ని అన్ని విధాల అడ్డగించగలను' అలా అసురత్వపు నిర్మూలనకు 'ఫర్మానా' జారీచేసిన నాయకులు బాపురెడ్డికి ప్రియతములు. అందుకే నెహ్రూ మృతికి వ్యథచెందిన కవి హృదయం.

'ఓ భారతదేశ మూలస్తంభమా !
ఓ మానవజాతి శాంతిబింబమా !
ఒరిగిపోయితివా నేడు నేలకు !
తరలిపోయితివా స్వర్గసీమకు !' అంటూ
విలపించింది. (జవహర్‌లాల్)

లాల్ బహాదూర్ అస్తమయానికి
'నడిరాతిరి నీజాతిని
విడిపోయితివా !
ప్రతిగుండియలో దీపము
ఇడిపోయితివా ! అంటూ శోకించింది.
(లాల్ బహదూర్)

టంగుటూరి ప్రకాశం జ్ఞప్తికిరాగానే
'ఎవరయ్యా ! నీసరి
హే ! ఆంధ్రకేసరి
మరువదు నిన్నీ దేశం (సరిలేని కేసరి)
టంగుటూరి ప్రకాశం' అంటూ గర్వపడింది.

ఈ స్మృతికవితా పఠనంతో బాపురెడ్డి ఆర్ద్రహృదయం మనకు అవగతమౌతుంది.

బాపురెడ్డి కవితావస్తువు విషయంలో పట్టింపులేనివారు. ఆడంబరానికి అర్రులు చాచనివారు. ఆయన ఎంత భాషాసంపన్నులో కవిత్వం విషయంలో అంత నిరాడంబరులు. ఎద కదిలితే, భావం రగిలితే కవిత మరాటాగుర్రంలా పరుగెత్త వలసిందే !

'పొట్టమాడ్చుకొని నిన్ను
పొదుపు చేయ మనలేదు
కట్టుబట్టకో ఎమైన
ఖర్చుచేయ కనలేదు' (పొదుపు పిలుపు)
అంటూ పొదుపుకై పిలుపునిస్తున్నారు.

ప్రజలకోసం కవిత్వం వ్రాస్తున్నాం అంటూనే ప్రజలకు అర్థంకాని భాషలో కవితల్లే మహాకవులు ఎందరో ఉన్నారు. వారందరికీ వందనాలు. మనదేశం ఎదుర్కొనే సమస్యలు ఎన్నో ఉన్నాయి. మరి ఆసమస్యలు కవిని కదిలించక మానవు. కవితగా అవతారం దాల్చక మానవు. అంత మాత్రంచేత 'కవిత్వం ప్రచారశాఖకాదు, సమాచార కేంద్రం కాదు, అంటూ వస్తువు విషయంలో గిరిగీసుకొని కూర్చోడం అభ్యుదయ కవికి వ్యతిరేకం. పొదుపన్నది ప్రతిమనిషికీ అవసరమే ! పొదుపులేని బ్రతుకు, జీవితంలో ఎన్నో గతుకులను ఎదుర్కొనవలసివస్తుంది. నేటిపొదుపే రేపుకిమదుపు.

'భావిజీవితముకూడ
భద్రపరుచు కొమ్మంటిని
నీదేశంకొరకు కొంత
నిన్ను సాయపడమంటిని'

ఈపొదుపువల్ల జీవితానికి భద్రం. దేశానికి సౌభాగ్యం.

'పికవధూ ! నీపాటవిను ఓ
పికతవంతయు లేదు నాకిక
వినదలంచితి విశ్వమానవ
విజయగీతములు' (ఈప్స)

అంటూ సమాజాన్ని దర్శించే 'ఈప్సను వ్యక్తపరుస్తున్నారు బాపురెడ్డి. సమాజావగాహన కవికి జీవనాడి. గృహనిర్బంధంలో వ్రాసిన కవితకూ, సమాజం గుండెపై కూర్చొని వ్రాసే కవితకూ ఎప్పుడూ తేడాఉంటుంది. ఆనందవనధిలో విహరిస్తున్నా పతితులను భ్రష్టులను మరచిపోని మన స్తత్వం మహాకవియానికి మంచి ప్రారంభం అనవచ్చు. కోకిల పాటకన్న మానవగీతమే గొప్పదిగా భావించే బాపురెడ్డి - విరియని పేదబ్రతుకులను గూర్చి, శ్రామికుల కన్నులలో వెన్నెలలను గూర్చి, సమసమాజ విహారజీవితము, దరిద్రజనావళికి భాగ్యోదయమును గూర్చి ఎంతో ఆరాటాన్ని

కోరికను వ్యక్తపరిచారు. ఆయనకోరిక కమ్మగా ఈడేరే రోజుకోసం నిరీక్షిద్దాం!

ఒక్కజాతి రెండుముక్కలు, ఒక్క గుండె రెండుచెక్కలు, కావడం బాపురెడ్డి సహించలేరు. సమైక్యం అంటే ఆయనకు ప్రాణం. అందుకే

'గోదావరి కృష్ణ నేడు
కూడిపాడగా
ప్రతి ఆంధ్రుని ఎద సమైక్య
భావ మాడెగా !'

అంటూ సమైక్యగీతాన్ని మధురంగా ఆలపిస్తున్నారు.

'జాత్యైక్యము విశ్వప్రేమ
గీతి పాడరా,
సర్వజీవితాభ్యుదయో
త్సవము సేయరా' (ఏకధార)

అంటూ ప్రగతి ప్రస్థానానికి తెలుగువారి వెన్ను తడుతున్నారు.

కాంతిరేఖలు, కాంతివాకలు అయిన తీరవాసులను కవితలో వర్ణిస్తున్నారు కవి –

'కడలి అలల కలల పుట్టి పెరిగినాము
లలిత
కళల సౌరభాలు మోసి తెచ్చినాము
తీరవాసులం, దూర
తీరవాసులం మేము' (చిరంజీవులు)

అంటూ. ప్రశాంతమైన వాతావరణంలో బ్రతుకును స్వచ్ఛంగా గడిపే తీరవాసులు ఎంతైన అదృష్టవంతులు. కావ్యభాష వారికి తెలియకపోయినా నేలబాస, గాలిబాస వారికి తెలుసు. ఆ బాసలోనే వారు తేనెపాటలు పాడుతారు. అన్నితరహాల మనుష్యుల మనస్తత్వాలు బాపురెడ్డికి అనుభవైకవేద్యములే! తీరవాసులనుండి పాలమూరు ప్రవాళ్ళవరకు అందరూఆయనకు స్నేహితులే! పరస్పర వ్యతిరేకతలను సమన్వయ పరిచే స్నేహశీలి బాపురెడ్డి. అందరినీ అన్నింటినీ తనలో పొదుగుకొని నిండుగా సాగిపోయే ఆనంద గోదావరి బాపురెడ్డి కవిత.

ఇక ఆయన 'భావాలు' అనుకవిత కవిస్థితిని చిత్రంగా చిత్రించింది.

'ఎదలోనభావాలు
కదలాడుతాయి
కాగితము రమ్మంటె
కనులుమూస్తాయి.' ఎంత నిజం !
'నే నిదుర పోగానె
నిదురలేస్తాయి
లేచి నేకలమూన
లేచిపోతాయి
వాటి ఇష్టమ్మె నా
మాటలే వినవు
వాటి మాటలు విని
వ్రాయుదును కవితలను'

కాగితం కలం పట్టుకొని గంటలు నిరీక్షించినా కటాక్షించని భావాలు, ప్రమత్తంగా ఉన్నప్పుడు ఆకస్మికంగా ఊడిపడతాయి. ఏంలాభం ? అప్రమత్తతతో సన్నద్ధమయ్యేసరికి ఎండమావులవలె ఊరిస్తాయి. వాటి రాజ్యమే తప్ప కవికి అధికారం లేశమైనా లేదు. ఇక వాటిమాటలు విని కవితలు వ్రాయడమే శరణ్యం !

'చుక్కల్లోఉషశ్రీ' అనుకవిత బాపురెడ్డి కన్నీటిచుక్క. 1969 లో కవిగారి చిన్నారి ఉషశ్రీ కన్ను మూసినప్పుడు ఆయన కన్నులనుండి ఇది జారింది.

'ఉషారాగమును
నిశానాగములు
ఓర్వలేక మ్రింగినవి
రవి హృదయమ్మున
కవి హృదయమ్మున
కారుమబ్బ కమ్మినది'

ఉషశ్రీ భవబంధాలు త్రెంచుకొని బాలయోగినివలె దివికి చేరుకొంది.

'ఎక్కడో వెలుగు
చుక్కపాపల, మ
రొక్కతార చేరినది'

'బాపురెడ్డి గేయాల'లో ఆఖరి గేయం 'కాలం'

'చుక్కలనే కళ్ళతో
చూస్తున్నది కాలం
శూన్య మనే కడలిని
శోధిస్తున్నది కాలం'

క్షణంకూడా ఆగకుండా ఏగమ్యం లేకుండా సాగిపోవడమే కాలంలక్షణం. ఎన్నో మార్పులను ప్రవేశపెడుతూ, నదిలా అది ప్రవహించిపోతుంది. ఎన్నో నాగరికతలు, సామ్రాజ్యాలు, వైభవాలు దానిగర్భంలో నిధిలా దాగున్నాయి.

'గతము, భావి, ఆది, తుది
స్థితిలయములు లేవు
అనంతమను భావన కే
అర్థమ్మును లేదు
దేశకాలములు తమకే
తెలియక తడఁబడుతుంటే
ఎంతో తెలిసినట్లు
గంతులు వేయును నరుడు'

చివరగా మానవునకు ఒకచురక తగిలించి ముగించారు బాపురెడ్డి. 'గంతులు వేయును నరుడు' అనడంలో కోతినుండి మానవుడు పుట్టడంవల్ల వచ్చిన సాంప్రదాయికమైన అలవాటు ఇందు వ్యంగ్యంగా చెప్పబడింది. మనిషి ఎంత విజ్ఞాననిధియైనా ప్రకృతిదృష్టిలోనూ, కాలందృష్టిలోను చిన్నవాడే ! తన అల్పత్వాన్ని నిర్భయంగా ఒప్పుకోవడం మానవుడి దొడ్డతనానికి నిదర్శనం కాగలదు.

రాగా భావకవిగా, అరుణభావకవిగా ఈ 'గేయాల'లో మనకు పరిచయమయ్యారు బాపురెడ్డి. ఆయన కవితాస్వరూపం ఒక కుధరమైతే ఈవ్యాసం ఒకఅద్దం మాత్రమే ! సౌందర్యభావనను ఆత్మాబద్ధంచేసినా, సాంఘిక సమస్యను కవిత – మలచినా లలితత్వం వదులుకోని కవి బాపురెడ్డి. ఆ లలితకవితా సౌరభాలకు వేదిక ఈ 'బాపురెడ్డి గేయాలు'.

…+…

# కవికర్ణరసాయనం - పరిశీలనావశ్యకత

— శ్రీ జూలూరి వెంకటేశ్వరరావు, ఎం. ఏ.

సంస్కృత సాహిత్యంలో కాళిదాసున్నాడు. భవభూతి ఉన్నాడు. ఆంగ్ల సాహిత్యంలో షేక్‌స్పియరున్నాడు. మిల్టన్ ఉన్నాడు. తెలుగుసాహిత్యంలో పెద్దన ఉన్నాడు. నరసింహకవి ఉన్నాడు. ఈజంటల్లో మొదటివాళ్ళ పేరు తెలిసినంత మందికి రెండవవాళ్ళ పేరు తెలియదు. అలాగే రెండవవాళ్ళకంటే మొదటివాళ్ళు గొప్పవాళ్ళనేవాళ్ళు చాలామంది ఉన్నారు. కాని మొదటివాళ్ళకంటే రెండవవాళ్ళే గొప్పవాళ్ళనేవాళ్ళు కొద్దిమందైనా లేకపోలేదు. ప్రస్తుతం ఆయా సాహిత్యాల్లో భవభూతి పేరూ మిల్టన్ పేరూ వినిపిస్తున్నంతగాకూడా మనసాహిత్యంలో నరసింహకవి పేరు వినిపించటం లేదు. అసలు పెద్దన తెలిసిన చాలమందికి నరసింహకవి ఒకడున్నాడనే విషయం తెలియదంటే తప్పులేదు. ఇది మన దుస్థితికి తార్కాణమే కాని నరసింహకవి లోపం కాదు.

ఎవరీ నరసింహకవి ? సంకుసాల నరసింహకవి. ఆయనరాసిన కావ్యం ? కవికర్ణరసాయనం. పెద్దనమనుచరిత్రతో ఇది తులతూగుతుందా ? సమగ్ర పరిశీలన జరగందే ఎలా చెప్పగలం ? ఇలా పరిశీలించినవాళ్ళు ఇద్దరే కపిస్తున్నారు. కందుకూరి వీరేశలింగం మనుచరిత్ర గొప్పదన్నాడు. గురజాడ శ్రీరామమూర్తి కవికర్ణ రసాయనమే గొప్పదన్నాడు. ఆధారాలతో పెద్దగా రాయకపోయినా నాలుగుమాటల్లోనే కవికర్ణ రసాయనమే గొప్పదని చెప్పాడు మానవల్లి రామకృష్ణకవి. పరిశీలించిన వారిలో ఎక్కువమంది గొప్పదన్నంతలో ఈ కావ్యం గొప్పదవుతుందా అనవచ్చు. మరోలా చూద్దాం. 17, 18 శతాబ్దాల నాటి సంకలనగ్రంథం 'ప్రబంధ మణిభూషణం' ఉంది. ఇందులో మనుచరిత్ర నుంచి నాలుగుపద్యాలు గ్రహించగా కవికర్ణరసాయనం నుంచి 23 పద్యాలు గ్రహించాడు. సంకలన కర్తకు పద్యాల అందం ప్రధానంకాని కవులమీద అభిమానం, దురభిమానం ముఖ్యంకావు ఈ విధంగా కూడా కవికర్ణ రసాయనం గొప్పదనే ఒక అభిప్రాయం ఏర్పడుతోంది కదా !

కవికర్ణరసాయనం గొప్ప కావ్యమే అయితే ప్రస్తుత సాహిత్యాభిమానులకు దానిపేరు కూడా తెలియకపోవటానికి కారణం ఏమిటి ? ఆలోచిద్దాం. మనుచరిత్రకు చాలా వ్యాఖ్యానాలువచ్చాయి. దాని మంచి చెడ్డలను గురించి కొన్ని వందల వ్యాసాలు వచ్చాయి. సాహిత్యం చదువుకునే వాళ్ళకి దానిని గురించి చెప్పేవాళ్ళు చాలామంది ఉన్నారు. ఇక కవికర్ణరసాయనం సంగతి చూస్తే దీనికి వ్యాఖ్యానాలులేవు. వందల సంఖ్యలో కాదుకదా వేళ్ళమీద లెక్కించే సంఖ్యలో కూడా విమర్శన వ్యాసాలు రాలేదు. దీనిని గురించి చెప్పేవాళ్ళులేరు. ఇక దీన్ని గురించి తెలియలేదంటే ఎలా తెలుస్తుంది ? ఓపికతో శ్రమపడి తెలుసుకోవలసిందే.

పరిశీలించిన కొద్దిమందీ మనుచరిత్రకంటే కవికర్ణరసాయనంగొప్పదన్నారు. చెప్పిన వాళ్ళమీద మనకు గౌరవం ఉన్నా వాళ్ళమాటల్నే గుడ్డిగా అంగీకరించవలసినపని లేదు. రెండు కావ్యాలూ స్వయంగా పరిశీలించటమే మంచిది. ఆ తర్వాత మాత్రమే వాళ్ళఅభిప్రాయాల్ని ఆమోదించడమో, తిరస్కరించడమో జరగాలి. దీనికోసం కవికర్ణరసాయన కావ్యాన్ని పరిశీలనదృష్టితో అధ్యయనం చేయవలసి ఉంది.

కవికర్ణరసాయనం పరిశీలించవలసి ఉందనే దానిని మరికొన్ని విధాలుగా మనవి చేస్తాను నరసింహకవి తన కవికర్ణరసాయనకావ్యాన్ని శ్రీకృష్ణదేవరాయలకు అంకితం చేయాలనుకున్నాడు. కాని కవికర్ణరసాయనం చూసిన అల్లసాని పెద్దన అసూయతో నరసింహకవికి రాయల దర్శనం కాకుండాచేశాడు. విరక్తి చెందిన నరసింహకవి తనకావ్యాన్ని శ్రీరంగనాథునికి అంకితం చేశాడు. ఈ గాథ సాహిత్యలోకంలో చాలా ప్రచారంలో ఉంది పెద్దనలాంటి గొప్పకవి ఇలా చేస్తాడనుకోవటం పొరపాటని చాలామంది అభిప్రాయం. పెద్దకవి అయినంత మాత్రాన మానవ సహజమైన మాత్సర్యం పెద్దనలో ఉండదని గుడ్డిగా నమ్మటం పొరపాటు కావచ్చు. నారదుడు లాంటి మహర్షి తుంబురుడి గానం విని మాత్సర్యం వహించాడన్న విషయం మనకు తెలిసిందే. అలాంటప్పుడు అల్లసాని వానికి అసూయ కలగడం అసహజంకానీ, అమానుషంకాని కాదు. అందుచేత పైని చెప్పినట్లు జరిగితే జరిగి ఉండవచ్చు. జరిగిందని చెప్పటానికి చారిత్రికాధారాలు లేవు. ఏది ఏమయినా పెద్దనకీవాదు వచ్చింది. దీనిలోని సత్యాసత్యాలు తెలుసుకోవాలంటే పెద్దనలాంటి పెద్దకవికి అసూయ కలిగించేంత అద్భుతంగా ఈకావ్యం ఉన్నదా అనేది తెలుసుకోటానికి ఈకావ్యాన్ని పరిశీలించి తీరవసిందే. అప్పుడే చారిత్రికాధారాలు లేకుండా, పెద్దన మీద వచ్చిన ఈవాదులో యథార్థాన్ని గురించి మన అభిప్రాయం మనం ఏర్పరచుకోవచ్చు.

ప్రచారంలో ఉన్న మరోకథ కూడా కవికర్ణ రసాయన పరిశీలనావశ్యకతను

నొక్కి చెబుతోంది. ఆకథ ఇలా ఉంది. నరసింహకవి తనకావ్యాన్ని శ్రీకృష్ణదేవరాయలకు అంకితం చేయాలని విజయనగరం వెళ్ళాడు. ఆయనకు ఏవిధంగానూ రాజదర్శనం కాలేదు. కుటుంబ పోషణ కోసం పద్యాలు అమ్ముకున్నాడు. అందులో ఒక పద్యం రాయల కూతురు మోహనాంగికి చేరింది. ఒకరోజు తండ్రితో చదరంగం ఆడుతూ తనబంటు ఆయన ఏనుగుకూ మంత్రికీ మధ్య చిక్కుకు పోగా ఆమె 'ఉద్ధతుల మధ్య పేద కుండ దరమె' అన్నది. రాయలు ఆ పద్యం పూర్తిగా చదివించుకొని విన్నాడు. నరసింహకవికి సన్మానం చేయాలనే ఉద్దేశంతో ఆయనకోసం వెతికించాడు. అప్పటికే నరసింహకవి తనకావ్యం శ్రీరంగనాథాంకితం చేసేశాడు. ఇది చారిత్ర్యసత్యం అవునో కాదో తెలియదు. కాని దీనిద్వారా గ్రహించవలసిన విషయం ఒకటుంది.

అది పద్యంలోని ఒకే ఒక్క పాదం నరసింహకవి విషయంలో, ఆయన కావ్యం విషయంలో రాయలంతటివాడికి ఆసక్తి కలిగించిందనే విషయం. కాళిదాసును గురించి ఒక లోకోక్తి ఉంది. అదేమిటంటే కాళిదాసునుగురించి తెలుసుకోవాలంటే ఆయనరాసిన శాకుంతలం, కాకుంటే అందులోని నాలుగో అంకం, ఇంకా కాదంటే అందులోని నాలుగు శ్లోకాలు చదివితే చాలు అని. కాళిదాసు ఘనత తెలుసుకోవటానికి నాలుగుశ్లోకాలు చదవాలి. నరసింహకవిని గురించి తెలుసుకోవాలంటే నాలుగు పద్యాలూ కాదు, నాలుగు పాదాలూ కాదు. ఒకే ఒక్క పాదం సరిపోయింది. ఒక్క పాదానికే ఇంత కథాకమామిషూ ఉంటే మిగిలిన కావ్యం పరిశీలించవలసిన అవసరం ఉందని చెప్పవలసిన అవసరం లేదేమో.

సాహిత్య విమర్శలో తులనాత్మక విమర్శ అని ఒక పద్ధతి ఉంది. అంటే ఒక గ్రంథాన్ని గురించి చెబుతున్నప్పుడు దాని మంచిచెడ్డల్ని ఇతర గ్రంథాలతో పోల్చి నిరూపించటం. నరసింహకవి, పెద్దన, ముక్కు తిమ్మన సమకాలికులు కావటంవల్ల కవికర్ణరసాయనం, మనుచరిత్ర, పారిజాతాపహరణం ఒకే కాలానికి చెందుతాయి. కాకపోతే ఏకావ్యం ఏవకో అనేది తెలియదు. అందుచేత ఒకే యుగంలో వచ్చిన ఈ కావ్యాల్ని తులనాత్మకంగా పరిశీలించటం మంచిది. ఈ సందర్భంలో మరోవిషయం గమనించవలసి ఉంది. ఈ మూడు కావ్యాల్లోనూ కొన్ని సమానవిషయాలున్నాయి. ఉదాహరణకు ఒక విషయం చూద్దాం. కుంతల రాజు కూతురును పెళ్ళిచేసుకోవటానికి వెళుతున్న మాంధాతను పౌరకాంతలు దర్శించిన విధాన్ని నరసింహకవి పది పద్యాల్లో వర్ణించాడు. మనోరమను పెళ్ళాడటానికి వెళ్తున్న స్వారోచిని పౌరకాంతలు దర్శించిన విధాన్ని పెద్దన పది పద్యాల్లో వర్ణించాడు. స్వర్గలోకంలో ఇంద్రుడి ఇంటికి వెళ్తున్న శ్రీకృష్ణుడిని పౌరకాంతలు దర్శించిన విధాన్ని పది పద్యాల్లోనే తిమ్మన వర్ణించాడు కాంతల విలాస విభ్రమాలూ, కవుల చమత్కారాలూ, ప్రస్తుతం మనకు వద్దు. పౌరకాంతల విలాసాలను ముగ్గురు కవులూ పదేసి పద్యాల్లోనే వర్ణించారన్నది మనకు ముఖ్యం ఇలాంటే మరికొన్ని సమాన విషయాలు మూడుకావ్యాల్లోనూ ఉన్నాయి. ఎవరిని ఎవరు అనుకరించారో, ఎవరిమీద ఎవరి ప్రభావం ఉందో, తెలుసుకోవాలంటే మూడు గ్రంథాల్నీ తులనాత్మకంగా పరిశీలించాలి ప్రస్తుతం మనుచరిత్ర, పారిజాతాపహరణ కావ్య విశేషాలమీద పరిశీలనగ్రంథాలున్నాయి. కవికర్ణరసాయనం మీదకూడా పరిశీలనగ్రంథం వస్తే తప్ప ఈ కావ్యాల తులనాత్మక పరిశీలన సాధ్యంకాదు. అందుచేతకూడా ఈ కావ్యంపై పరిశీలన జరగవలసి ఉంది.

నరసింహకవి సమకాలీన కవుల నిరసనకు గురయిఉంటాడని తోస్తున్నది. పెద్దన అనూయ వృత్తాంతం అలా ఉంచుదాం. కావ్యంలోని విషయాల్నిబట్టి పరిశీలిద్దాం. కావ్య అవతారికలో కుకవి నిందచేయటం సంప్రదాయంగా వస్తోంది. నరసింహకవికూడా అవతారికలో కుకవి నిందచేశాడు. అంతేకాక సమయానుకూలంగా కావ్యంలోకూడా అనేకసార్లు కుకవుల్ని నిందించాడు. దీనికి కారణం ఏమిటో ఆలోచించాలి. చిగురించిన మామిడిచెట్టును చూసి ఒంటెలమంద మెచ్చకపోయినా ఒక కోయిలపాగ డ్తకు నోచుకుంటుంది. అలాగే ఎల్లరు మెచ్చని తన కావ్యాన్ని ఒకడు (సత్కవి లేదా సహృదయుడు అనుకోవచ్చు) మెచ్చుతాడంటాడు. కావ్యంలో ఉన్న దానికంటే విశేషంగా భావించి ఆదరించే సత్కవులుఅందరికీ అకారణబంధువు లంటాడు. అలాంటి ఒకడికోసం లేదా సత్కవుల కోసం అన్నట్లు, ఇతివృత్తాన్నిబట్టి మాంధాతృచరిత్రం అని పేరుపెట్టవలసిన తన కావ్యానికి కవికర్ణరసాయనం అని పేరు పెట్టాడు. ఈ విషయాల్ని జాగ్రత్తగా ఆలోచిస్తే నరసింహకవి సమకాలీనుల నిరసనకు గురయిఉంటాడని భావించటం పొరపాటు కాకపోవచ్చు. ఒకకవికి ఆదరణ కానీ, అనాదరణ కానీ అతని కావ్యాన్నిబట్టే లభిస్తుంది. కాబట్టి ఈ దృష్టితోకూడా కవికర్ణరసాయనం పరిశీలించవలసి ఉంది.

కవికర్ణరసాయనం అవతారికలో నరసింహకవి ఒక భీకర ప్రతిజ్ఞ చేశాడు. తన కావ్యంలోని శృంగార వర్ణనం విన్న యతి విటుడు కాకుండా ఉండలేడని, వైరాగ్యవర్ణనం విన్న విటుడు యతి కాకుండా ఉండలేడని ప్రకటించాడు. దీనికితోడు లోకుల నాలుకలే అసలుగా

# విత్తే ముందు

శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు,
ఎం. ఏ.

పుడమి బురదమద్ద వడువునఁబడియుండె
గ్రుడ్డి గ్రుడ్డి వెలుఁగురులు నటించె-
పేడపురుగు లట్టు లేడనుండియొ పుట్టి
రాలుమగలునైన యాది నరులు

అపురావు రను చు ఆకటిపెల్లుచే
తల్లడిలుచుఁ బోరలు దంతులను
పుడమితల్లి కరుణపాడవిన దృక్కుల
నాదరించి తినుఁ డఁటంచొసంగ

మట్టిముద్ద యొకటి మామిడి పండాయె,
ఒకటి నారికేళ మొకటి యరఁటి,

(రెండవ కాలం చూడుడు)

ఒక్కటేమి! ఇచ్చు చుండిన ఆ మట్టి
ముద్దలెల్ల పండ్లపోలువు దాల్చె
జరరాగ్ని జీవులగు క
ర్మరులను సంతానమై క్రమక్రమవృద్ధిన్
కతిన క్షుద్దండహార్యలు
మర భిక్షువు లట్లు కోట్లమంది జనిఁపన్.

జడిసి పుడమితల్లి జనసంతతిని బిల్చి
'మట్టి పిసికి పండ్లు మలచి మలచి
చేతులెల్ల ఒక్కటే తిప్పులై పోయె
పోవు మంటి గర్భ భూతలికిని.'

అనిన 'ఆగు మాగు' మనుచు అన్నార్తులు
పుడమితల్లి నిట్లు లడిగి రపుడు
ఏమిచేసి పోదువే మమ్ము మాతృత్తు?
తిండిలేక చచ్చు టొండె గతియ!

అంత ధాత్రి యనియె ఆర్తులౌ మిమ్ముల
విడిచి చనుట నాకుఁ గడు భారంబే;
అయిన నేమి సేతు! అరుగక తప్పదు -
పోవ దూర, మిక్కడే వసింతు-

దుమ్ముపొరల క్రింద దూరి యుండెద; మీకు
ఏఫలమ్ము దినుట కిచ్చ యగునో!
ఆ ఫలమ్ము దెచ్చి అవని నించుక త్రవ్వి
కప్పిపెట్టు డెఱుఁగఁగలను కోర్కె.

ఆ ఫలమ్మునుండి ఆవిర్భవించును
మొలక, అదియె వృక్షముగఁ దనర్చు;
అదియొసంగు మీకు నాఫలమ్ములం బోలె
డవి భుజించి బ్రతుకుఁ డన్నలార!'

అట్లు చెప్పి తల్లి యంతర్హిత బయ్యె
విత్తనేర్చె జనము విత్తుముందఁ?
చెట్టు ముంద?' యన్న చిరకాలపుంబ్రశ్న
కొక్క యుత్తరమ్ము చిక్కె గడకు.

---

( 16 వ పేజీ తరువాయి )

ఉండేదే సత్కవిత్వం అన్నాడు. తన కవిత్వంలోని మరికొన్ని గుణాలను సూచించాడు. ఈ ప్రతిజ్ఞలను ఎంతవరకూ నెరవేర్చాడనేదానికోసం కూడా కవికర్ణరసాయనం అవశ్యం పరిశీలించదగింది.

చివరగా ఒక్కమాట. కవికర్ణరసాయనం సత్వరం పరిశీలించదగిన కావ్యం. ఇంతవరకూ దీనిపై కృషి జరగకపోవటం విచారకరం. ఒక కావ్యాన్ని మామూలుగా చదువుకునే విధంగానే ఈ కావ్య పరిశీలనకూడా ప్రారంభించవచ్చు. పెద్దన మీద ఉన్న అపవాదు, పద్యాలు అమ్ముకొని నరసింహకవి జీవించటం, సమకాలీనుల నిరసనకు గురికావటం వంటి విషయాల్ని జాగ్రత్తగా పరిశీలించాలి. కవికర్ణరసాయన, మనుచరిత్ర, పారిజాతాపహరణాలలోని పోలికలు, పరస్పర ప్రభావం వెదక పట్టుకోవాలి. పెద్దన మనుచరిత్రకంటే నరసింహకవి కవికర్ణరసాయనం గొప్పదా అన్న విషయాన్ని లోతుగా పరిశీలించాలి.

---

# గోదావరి పుష్కరాలు - తల్లి గోదావరి

— శ్రీ వై. ఎస్. నరసింహారావు, బి.ఏ., డి.సి.ఆర్.ఎన్

గత గోదావరిపుష్కరాల సందర్భంగా రాష్ట్ర సమాచారశాఖ ప్రచురించిన 'గోదావరి పుష్కరాలు' 'తల్లి గోదావరి' అను పుస్తకాలను జాగ్రత్తగా చదివేను. శ్రీ ఎ. బి. కె. ప్రసాద్ సంకలనం చేసిన తల్లి గోదావరి రెండవ పేజీలో 'రాజరాజ నరేంద్రుడు (1022-63) అనే తూర్పు చాళుక్యరాజు సంతతికి చెందిన పాలకుడు రాజమహేంద్రవరం నిర్మించాడు. 'రాజమహేంద్ర' అనే తనపేరును పెట్టాడు. విన్నకోట పెద్దన రచించిన కావ్యాలంకార చూడామణిలో చాళుక్యరాజు ఈ పట్టణం నిర్మించినట్లు వుంది.' దీనిక్రిందనే 'విమలాదిత్యుని కుమారుడు రాజరాజ నరేంద్రుడు క్రీ. శ 1022 ఆగష్టు 16 న తంజావూరులో జన్మించాడు. అప్పటి చోళరాజ్యానికి రాజధాని నిర్మించదలచి పవిత్ర గౌతమీ నదీతీరాన ఈ పట్టణం వెలయించాడు.' అని ఉన్నది.

చారిత్రకాంశాలు వ్రాసేటప్పుడు జాగ్రత్తగా ఆలోచించాలి. ఒకే పేజీలో పరస్పర విరుద్ధమైన వాక్యాలు వ్రాసేటప్పుడైనా చూచుకోవద్దా? 1022 ఆగష్టు 16 న రాజరాజ నరేంద్రుడు పట్టాభిషిక్తుడయ్యేడు. ఈ విషయాన్ని 1922 లో జరిగిన రాజరాజ నరేంద్ర పట్టాభిషేక - నవశతాబ్ది - ఉత్సవ సందర్భంగా వెలువడిన రాజరాజ నరేంద్ర సంచికలో చరిత్రకారులు స్పష్టం చేసియున్నారు. ఈ తేదీని ఆయన జన్మించాడని చెబుతున్నారేమిటి ప్రసాద్ గారు? ఆ తేదీని జన్మించినవాడు ఆ తేదీని పట్టాభిషేకం చేయించుకోలేడు కదా! కనుక ఆయన 10వ శతాబ్దం చివర జన్మించి యుండవచ్చును. తేదీని కాని సంవత్సరాన్ని కాని యింతవరకు చరిత్రకారులు నిర్ధారించలేదు. ఈయన పరిపాలనకాలం 1022 నుండి 62 వరకు, కాదు. 1022

నుండి 63 వరకు. ఈయన రాజమహేంద్రవరాన్ని నిర్మించినట్లు వ్రాశారు. ఇది పచ్చి అబద్ధం. అంతకుముందే మొదటి అమ్మరాజు నిర్మించినట్లు చరిత్ర చెప్తున్నది. రాజధానీ నగరాన్ని నిర్మించే టంతటి మహారాజు కాడు. మిక్కిలి బలహీనుడు రాజరాజు. వారు పేర్కొన్న విన్నకోట పెద్దన గ్రంథంలో కూడా చాళుక్య రాజు కట్టాడని మాత్రమేవుంది. మొదటి అమ్మరాజు కూడా చాళుక్య రాజే.

ఇక గోదావరి పుష్కరాలు (సంకలన కర్త పేరులేదు) 4 వ పేజీలో 'చాళుక్య చక్రవర్తి రాజరాజ నరేంద్రుడు క్రీ. శ 1022 లో ఈ పట్టణాన్ని నిర్మించాడని చెబుతుంటారు. నన్నయ భట్టారకుడు రచించిన మహాభారతంలో ఈ ప్రస్తావన కనిపిస్తుంది' అని వ్రాశారు నన్నయభారతాన్ని అనేక పర్యాయాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసినవారిని అడుగగా పట్టణాన్ని నిర్మించినట్లు ఎక్కడాలేదని కచ్చితంగా చెప్పేరు. ఇంత మోసం ఎక్కడైనా వుంటుందా?

'గోదావరి పుష్కరాలు' నాలుగవ పేజీలో 'మార్కండేయ పురాణాన్ని అనుసరించి భగవాన్ వ్యాసుడు సంస్కృతంలో మహాభారతగ్రంథాన్ని యిక్కడే రచించారు' అని వ్రాశారు. ఇలా వ్రాయడానికి ఎన్ని గుండెలుండాలి? మార్కండేయ పురాణంలో ఈ ప్రస్తావనే లేదని పండితులెవరైనా చెబుతారు. ఒకవేళ ఇదే నిజమయితే ఇంతకంటే ఆనందకరమైన విషయముంటుందా? ఇంత గొప్ప విషయాన్ని యింతవరకూ ఎందుకు దాచేరు? అనువాద గ్రంథం యిక్కడ వెలువడినందుకే మనం ఎంతో ఆనందిస్తున్నాం కదా! అసలు గ్రంథమే వెలువడితే యింకేం కావాలి?

ఇవి ప్రభుత్వ ప్రచురణలు. అన్ని గ్రంథాలయాలకీ వెళతాయి. వేలకొలది

(తరువాయి 20 పేజీలో)




## చక్రతీర్థమాహాత్మ్యము

(గ్రంథకర్త : శ్రీ కపిలవాయి లింగమూర్తి, మూల్యము : రు. 4-50, ప్రతులకు : కె. కిశోర్‌బాబు, వాణీసదనము, నాగర్‌కర్నూల్ - 509 209.)

ఇది స్థలచరిత్రను చెప్పు కావ్యము. తెలంగాణము నందలి నాగర్‌కర్నూల్ సమీపమున గల పెదపల్లి గ్రామమున వెలసియున్న బుగ్గ శ్రీవెంకటరమణ స్వామివారి ఆలయచరిత్ర ఇందలి ప్రధానాంశము.

శ్రీ కపిలవాయి లింగమూర్తి గారికి వేంకటేశ్వరస్వామిపై గల భక్తి ఈ కావ్యరచనకు ప్రేరణము. ఇది అయిదాశ్వాసముల కబ్బము. ఛందస్స్వీకరణము నందు ప్రాచీనమార్గము ననుసరించియు, కథచెప్పుటయందొక చక్కని నవ్యతను కవి పాటించెను.

పురాణములలో నైమిశారణ్యమునందలి సూతుని కట్టి కథకత్వ గౌరవము కలదో అట్టి యుచితపీఠము పెదపల్లిలో నుండు ఒకానొక వృద్ధునకు ఒసంగబడినది. అట్టి ఆ గ్రామవృద్ధులు సాంప్రదాయికముగా చెప్పుకొను కథ కావ్య కథగా మలచబడినది. ఏతదితివృత్తమును సేకరించి యిచ్చిన తన శిష్యుని అవతారికలో శ్లాఘాపూర్వకముగ కవి ఆశీర్వదించెను.

దేవేంద్రపురి యను యతికి ఒకరాత్రి వేంకటరమణస్వామి కలలో కన్పించి తానున్న ఏదుట్ల అరణ్య ప్రాంతమును చూపి, అందొక తావున త్రవ్వించి భూస్థాపితుడైయున్న తన్ను ఉద్ధరింపవలసినదిగా కోరెను. దేవేంద్రపురి అట్లు చేయింపగా అందు స్వామివారి విగ్రహము లభించినది. పైగా ఆస్వామివారి పాదప్రదేశమున ఒకానొక జలబుగ్గయై యుండికవచ్చినది. పాదముల యందలి బుగ్గతో సహా అవతరించిన స్వామి యగుటచే బుగ్గ వెంకటరమణస్వామి యని నామకరణమైనదట. ఇది ప్రథమాశ్వాసకథ. ఈ క్షేత్రమునకే చక్రతీర్థమని నామాంతరము.

అక్కడ తీర్థకుండమునకై సాగించిన త్రవ్వకములలో 'స్వయంభువు' ఐన విశ్వేశ్వరుడు లింగాకారముగ లభించుట వర్ణితమైనది. శివకేశవాద్వైతమును పాటించి, అక్కడ విశ్వేశ్వరాలయమును కూడ నెలకొల్పిరట. ఇది ద్వితీయాశ్వాస కథ.

అక్కడ దేవతార్చనాది కార్యనిర్వహణ నిమిత్తమై ఒక గ్రామము నిర్మాణము చేయబడెను. పంటలకై యుపయోగపడగల తె పెద్దతటాకము కూడ అచ్చట త్రవ్వబడెను. ఇది తృతీయాశ్వాస ఇతివృత్తము.

చతుర్థ పంచమాశ్వాసములలో ఆ దేవాలయమునందు అర్చకులుగా నియమితులైన విశ్వబ్రాహ్మణవంశీయుల యొక్కయు, వైష్ణవబ్రాహ్మణవంశీయుల యొక్కయు, చరిత్ర వర్ణితమయినది. అస్థలమాహాత్మ్యము కూడ పంచమాశ్వాసాంతమున ఫలశ్రుతివలె ధ్వనించునట్లు నిబంధింపబడినది.

శ్రీ లింగమూర్తిగారు బహుగ్రంథములు రచించిన కవి. పద్యమును ధారాళమైన శైలిలో సుఖముగా నడిపింపగల నేర్పరి.

'అమృతము కావ్యమున్ సురల
కారయ కావ్యము నన్నమున్ జనో

త్తములకు ధాత యేర్పరచె ధారుణి
భోజ్యము గాఁగ ......'

అని చెప్పిన మాటలలో - కావ్యమునకు అమృతత్త్వమును ఆపాదించిరి. చక్కని యూహ. మానవస్వభావచిత్రణము నందు వీరి కున్న దగిన నేర్పు గలదు. మట్టిత్రవ్వకపు పనులుచేయు ఉప్పరుల పనిపాట్లను మిక్కిలి సహజముగా వర్ణించుచు,

'మొలను చేవమునకి పంచియు,
ముడుక కాసె
తలరుమాలున చుట్టపీకలను దోపి
భుజమునం గడ్డపారలు పొదలుచుండ
నుప్పరులగుంపు గదలె నప్పుడ్పు యనఁగ'

అని చెప్పిన పద్యము, అట్లే పనులు ముగించుకొనిన ఉప్పర స్త్రీలను వర్ణించుచు,

'చన్నిచ్చువేళ యయ్యెను
చిన్నారులపాలు గుడుపఁ జేరిరి తల్లుల్
సున్నగిలె పని మొగంబును
వన్నెదఱిగి పుల్లగిలియె భానుఁడు
గూడన్.'

అని చెప్పినకందము ఎంతో అందముగా నున్నవి.

గ్రామనిర్మాణ సమయమున ముందుగా గ్రామదాయిని నిల్పుట, దక్షిణ దిక్కున వీరాంజనేయస్వామిని ప్రతిష్ఠించుకొనుట, ముగ్గుగీతలు గీసి గృహనిర్మాణము లారంభించుట, మొదలగు విషయములు కవికిఁ గల వాస్తుజ్ఞానమును విశదపఱచుచున్నవి.

'కంబలి కంపటియుండిన
యంబలిలేకున్న మాకె నన్పించెను, రే
యింబవళులు జనములకును
సంబరములు దగ్గిపనులు చల్లంబడియెన్.'

అన్న పద్యము చాటు పద్యరచనా సారళ్యముతో నడచినది.

'భూదేవతలులేక పుణ్యకర్మలు లేవు
రొుజ్జ లేకుండిన నోగులేదు.
'అర్ధరాత్రినిబుట్టె అంత కాంతకమూర్తి
మధ్యాహ్నమునఁ బుట్టెమారగురుడు'

వంటి సీసములు చదువువారికి ఆనందము కల్గించును.

'కంబళి కంపట్టయుండిన యంబలి' 'కర్మలు లేవు రొుజ్జలేకుండిన' వంటియస్థానయడాగమములు, 'ద్రవ్వు చుండంగ' (2ఆ. 42 ప.) అని ఆదేశ సరళముతో పద్యమునే ఆరంభించుట, పలుచోట్ల మకారమునకు అబిందుపూర్వక పకారముతో యతిమైత్రిచేయుట (ఉదా: (ము, మ్యారులు గడ్డపారగొని పొదగలించియు), 'శ్రీరామునకు నయోధ్యా తీరున', మున్నగు అత్యంత విరుద్ధములైన ప్రయోగములు, లేకుండినచో మరింత యందగించెడిది.

'యాచకమందారుడు వసు
ధాచక్రవికీరణుండు గజపూపుడునై'
(ద్వి. 4 ప.)

'తఱుచుగా కటిపైఁ దీర్చికట్టి'
(ద్వి. 4 ప)

'రమ్మిడిజనుదేలరాఁగ నోగినిట్లనియెన్'
(ద్వి. 35 ప)

అనుపాదములలో యతిభంగములును, కందపద్యపాదములైన 'చే) శమ్ముదెచ్చి నారు గున్న జనపతులిచ్చన్' (తృ. 49 ప '(ఇంతిం)తలుగా గట్టించుకొంచు తరలి రిఁడ్లగన్. (చతు 65 ప.)

అనువాని యందు గణదోషములును దొరలినవి.

కవులకు సహజమైయుండు స్వస్థలాభిమానము, ప్రత్యేకించి తెలంగాణ కవుల యం దెక్కువగ గోచరించు చరిత్ర జిజ్ఞాస శ్రీ లింగమూర్తి గారి యందు పుష్కలముగా నున్నవి.

మొత్తము మీద ఈకావ్యము సరళమైన రచనా సౌభాగ్యము కల్గి, క్రొత్త యితివృత్తమును పాఠకులకు అందించుచున్నది.

— సుగుణారాధక.

## రాజమహేంద్రవరము

( తెలుగు నవల

(రచయిత: అష్టావధాని శ్రీ చిలుకూరి రామభద్రశాస్త్రి, 220 పుటలు. వెల రు 6/- తొంటెపు సుబ్రహ్మణ్యంగారి యిల్లు, మెయిన్ రోడ్డు రాజమండ్రి.)

ఏతద్గ్రంథమును గూర్చి ప్రముఖ విద్వాంసులు శ్రీ దాసెర్ల వెంకటరావు గారు, శ్రీ ఎం ఆర్. అప్పారావుగారు, శ్రీ కొల్లి అనంత పద్మనాభ శాస్త్రిగారు, శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు, శ్రీ పోతుల వీరభద్రరావుగారు, శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు, అమూల్యములయిన, అభిప్రాయముల నొసగి ప్రశంసించియుండిరి.

వీరు నవల,చారిత్రక గ్రంథము, క్షేత్ర మాహాత్మ్యము, విమర్శగ్రంథము, పౌరాణిక గ్రంథము అనే విభాగాలలో దేనికి గ్రంథము చెందు ననే విషయమును పరామర్శింపక పాఠకుల భావనకే వదలివైచుట మిక్కిలి యుచితము.

రాజమహేంద్రవరమున, పరిసరప్రాంతములఁగల అనేక పుణ్యక్షేత్రముల దేవాలయాదుల వృత్తాంతవిశేషము లిందు చర్చాపూర్వకముగా ప్రదర్శింపబడినవి. పుష్కరయాత్రికుల కెంతో సమాచార మిందు గలదు. రాజమహేంద్రవరము 1979 నాటి మ్యాపుకూడ ఇందు చేర్చుట ఎంతో సముచితమైయున్నది.

వ్యాసుడు, నన్నయ, శ్రీనాథుఁడు అనువారి సంభాషణ రూపమున కల్పితమైన యీగ్రంథమున చారిత్రక సత్యతి మును గాని విషయక్రమ సముపస్థితిని గాని సిద్ధాంత పరిణతిని గాని అపేక్షించుట సమ

జసము గాదు. '50 పేజీల పుస్తకం అని దిగితే 230 పేజీల దాకా దేకింది కాబట్టి యీ ధనార్థం ఎడ్వర్ట్ టేజ్ మెంటులూ- సంక్షిప్త చరిత్రలూ పుస్తకంలో స్థలం సంపాదించినాయి' అనే రచయిత మనవి పరిశీలించిన తర్వాత గ్రంథస్థ విషయ సమగ్రత నపేక్షించుటయు భావ్యము కాదు.

1. ఈ రచన రాజమహేంద్రవరాన్ని గూర్చిన విజ్ఞాన సర్వస్వం అంటే అతిశయోక్తి లేదు.

2 సారంగధర మెట్ట మున్నగు ఐతిహ్యములను సోపపత్తికముగా నిర్ణయించి వాని చారిత్రికాస్తిత్వమును నిరూపించుట ప్రశంసార్హము. ఈ గ్రంథము ఒక సంపూర్ణ రాజమహేంద్రవర చరిత్రముగా రచించిన శ్రీశాస్త్రి గారు ప్రశంసార్హులు.

3. చరిత్ర దృష్టితో గూడ పరిశీలన మొనర్చి సంశయాస్పదములైన వానిని సిద్ధాంతీకరించియున్నారు. సారంగధర వృత్తాంత మిందుకు నిదర్శనము

4. రాజమహేంద్రవరంలో ఎన్నో జరిగాయి జరుగుతూనేఉన్నాయి వాటిలో ముఖ్యమైన వాటినన్నింటినీ పూసగ్రుచ్చినట్లు శ్రీ శాస్త్రిగారు ఏకరువు పెట్టారు.

పై వాక్యములతో ఎందరు విజ్ఞులు ఏకీభవింతురో చెప్పుట కష్టము.

వ్యావహారిక మునకు సన్నిహిత భాషలో వ్రాయబడిన ఇట్టి గ్రంథమున భాషా స్ఖాలిత్యాదులను, ముద్రణ స్ఖాలిత్యాదులను తడవుట యుచితము గాదు.

ప్రముఖ విద్వాంసులు శ్రీ రామభద్ర శాస్త్రిగారి సంకల్ప ముదారము వారి బహుగ్రంథ పరిశీలన కృషి యెన్నదగినది యనుట నిస్సంశయము.

~~~

# యేసుకృష్ణీయము

( ద్వ్యర్థి కావ్యము )

రచయిత అష్టావధాని శ్రీ గాడేపల్లి వేంకటేశ్వరరావు ఎం.ఏ. ఉపన్యాసకులు, ప్రభుత్వ కళాశాల, రాజమండ్రి. పుటలు 28 వెల రు. 4/-

ఈ గ్రంథము అతిసరళమైన భాషలో ఏసుపరముగాను, కృష్ణ పరముగాను రెండర్థములు వచ్చునట్లు రచింపబడిన 9 పద్యముల (7 గీతములు + 2 కందములు) లఘు కావ్యము. రచయిత చక్కని నిర్దుష్టమైన, కవిత చెప్పగలవాడు. కవితాగుణములన్నిటి నత్యల్ప పరిమితిగల ఈ గ్రంథమున ప్రదర్శింప నవకాశముండదు గదా! రెండర్థముల కావ్యము రచించు తలంపూనుటయె సాహసము. దానిని జయప్రదముగా నిర్వహించిన కవి అభినందనీయుడు. నేటి పాఠక లోకమున కవసరమయిన రీతిని రెండర్థములు వ్రాసి యుంచుట యుచితముగానున్నది. ఇందలి చివరి పద్యమున 'ఈ, కరుణామయు చరితము నే, పురుషుండు వినుc జదువు నతఁడు పొందగ డఘమ్ముల్' అనుచోట పొందు శుభమ్ముల్ అనక పొంద డఘమ్ముల్ అనుట లోని వైశిష్ట్యము గమనింపదగినది

…+…

---

( 18 వ పేజీ తరువాయి )

మంగి విద్యార్థులు చదువుతారు భవిష్యత్తులో పరిశోధన చేసేవారు ఈ ప్రభుత్వ ప్రకటనలను నమ్మి మోసపోతారు పరస్పర విరుద్ధ వాక్యాలవల్ల గందరగోళంలో పడతారు.

'తల్లి గోదావరి' 5వ పేజీలో 'ఇప్పటికీ సారంగధర మెట్ట, కోటగుమ్మమూ యాత్రికులు దర్శిస్తూంటూరు.' అని వ్రాశారు ఇక్కడ లేని కోటగుమ్మాన్ని ఏలాచూస్తారో? చరిత్ర సంబంధం లేని సారంగధరుని ప్రస్తావన ఎందుకో? 10 వ పేజీలో 'కాటన్' విగ్రహం బొబ్బర్లంకవద్ద ఉన్నదని వ్రాశారు సాదే పొగపాటేమో అని ఒకసారి బొబ్బర్లంక వెళ్ళేను. అక్కడ ఆదిలేదే! ధవళేశ్వరంలో ఎప్పటినుండో ఉంది. అదే పేజీలో 'సుప్రసిద్ధ చిత్రకారుడు దామెర్ల వెంకట్రావు' అని వుంది. ఆయన వెంకట్రావు కాదు, రామారావు. 13 వ పేజీలో 'ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఎడింబరోలో విద్యాభ్యాసం చేసి ఆర్ట్సు కాలేజీలో ఆచార్యులుగా పనిచేశారు అనివుంది. ఆయన పనిచేసింది ట్రయినింగ కాలేజీ నాటి వారి శిష్యులు శ్రీ దామెర్ల వెంకటరావు గారిని అడిగితే చెప్పేవారు కదా!

14 వ పేజీలో బ్రహ్మ జోస్యుల సుబ్రహ్మణ్యంగారు సీతానగరంలో మరణించినట్లు వ్రాశారు ఆయన రాజమండ్రిలో స్వర్గస్థులైరి.

ఇదే పుస్తకంలో రాజమండ్రి దేవాలయాలు అనే శీర్షిక క్రింద రాజమహేంద్రవర క్షేత్రపాలకుడు, చారిత్రకంగానూ పౌరాణికంగానూ ప్రసిద్ధుడూ ఐన శ్రీవేణుగోపాలస్వామి దేవాలయాన్ని గూర్చి వ్రాయలేదు చారిత్రకంగాగాని పౌరాణికంగా గాని ప్రసిద్ధంకాని సారంగధర దేవాలయాన్ని గూర్చి వ్రాశారు.

పంచారామాల్లో ఒక్కటైన సామర్లకోట, చారిత్రకంగాను పౌరాణికంగానూ ప్రసిద్ధములైన పిఠాపురం, కోరుకొండ, సర్పవరం, బిక్కవోలు, పలివెలలను గురించి ప్రస్తావనే లేదు 19 వ పేజీలో 'శ్రీ రాళ్ళబండి సుబ్బారావు ప్రభుత్వ ప్రదర్శన శాలను 1928 లో శ్రీ రాళ్ళబండి సుబ్బారావు స్థాపించారు' అన్నారు. దీనిని శ్రీ సుబ్బారావు స్థాపించలేదు. స్థాపన సంవత్సరం 1928 కాదు గౌతమీ గ్రంథాలయాన్ని 1879లో స్థాపించినట్లు వ్రాశారు 1898లో స్థాపించినట్లు అచట బోర్డు మీద నే ఉన్నదికదా! ఈ తప్పులు సరిదిద్దబడ వలసినవిగా భావిస్తున్నాను.

---
~~~

# రచయిత కు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁగాని యుండవచ్చును. సులక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన కొలదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంత వఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.

అడ్రసు :—
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-8-7, ఇన్నీసు పేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B. V. & Co , Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.